9.12.1994 శుక్రవారం, 12 పేజీలు, సంపుటి 66 సంచిక 50 వెల : రు. 2.00 లు

Phone 27354. Regd No. HNL 18

# జమీన్‌రైతు

స్థాపకుడు : నెల్లూరు వెంకట్రామానాయుడు

జీవప్రదాత : నెల్లూరు శ్రీరా...



# పసుపు చీకటి!

రాష్ట్రమంతటా తెలు... చీకట్లు అవరించాయి! పసుపు ... క్రమ్ముకున్నాయి. ఆంధ్ర ఓటర్లు తమంతట తాముగా ఎక్కడో లక్ష్మీపార్వతితో ప్రణయ కలాపాలాడుతూ, ప్రేమ గీతాలు పాడుకుంటూ, కాలం గడుపుతుంగిన ఎన్టీ రామారావును ఆహ్వానించి, ఆదరించి, అందలమెక్కించారు. అదీ సాదాసీదా ఆదరణ కాదు, అపూర్వము, అద్వితీయమైన ఆదరణ! దాన్ని ఆరాధన అన్నా తప్పుకాదు.

చరిత్ర ఎరుగని విజయ పరంపరతో విజయ విలాసం చేస్తున్నారు ఎన్టీ రామారావుగారు, ఆయన సతీమణి లక్ష్మీపార్వతి గారు; అనూహ్యమైన గెలుపుతో చరిత్రను తిరగ వ్రాశారు వారిరువురూ! చాపక్రింద నీరువలె తెలుగు గాలి సామాన్య ఓటరును గిలిగింతలు పెడుతున్నదని అందరూ ఊహించారు కాని, అది ఇంతటి తుఫానువలె రూపాంతరం చెందుతుందని తలలు పండిన రాజకీయ పండితులు కూడా అంచనా కట్టలేక పోయారు. తెలుగు ఓటరు ఎవరి అంచనాలకూ అందనంత ఎత్తుకు ఎదిగి పోయాడని

> ఇది తెలుగు గాలికాదు- తుఫానే!

మరొకసారి రుజువైంది. తమకే ప్రభుత్వం వుంటే బాగుంటుందో నన్న విషయంపై యావత్ ఆంధ్ర ప్రజానీకం ఒకే తీరులో ఆలోచించి, ఒకే నిర్ణయం ప్రకటించి, ఒకే తీర్పు చెప్పడం అపూర్వమైన విషయం. ప్రజాస్వామ్య పరిణతికి ఇంతకంటే వేరే రుజువు, సాక్ష్యం అవసరం లేదు.

ఈ వార్త వ్రాసే సమయానికి పూర్తి ఫలితాలు వెలువడలేదు. కానీ పరిస్థితి తేటతెల్లంగా, కళ్లకు కట్టినట్లు అర్థమై పోయింది. కోస్తా, రాయలసీమ, తెలంగాణా అనే తేడా లేకుండా మూడు ప్రాంతాలలోనూ ఒకే తీరులో తెలుగుదేశం విజయఢంకా మ్రోగిస్తున్నది. ఎన్టీఆర్ తొలిసారిగా రాజకీయ ప్రవేశం చేసిన 1983 లోకంటే; నాదెండ్ల ప్రహసనంతో జనం కాంగ్రెస్‌ను ఛీకొట్టి, ఎన్టీఆర్‌ను తమ భుజాలమీద మోసిన 1985లో కంటే మిన్నగా, అంతకు రెట్టింపు అభిమానంతో తెలుగు దేశాన్ని ఆదరించారు ఓటర్లు. ఈ వార్త వ్రాసే సమయానికి అందిన సమాచారం ఆధారంగా చూస్తే తెలుగుదేశం 210 నియోజక వర్గాలలో ఆధిక్యతలో వుంది. దాని మిత్రపక్షాలైన కమ్యూనిస్టులు గెలుస్తున్న నియోజక వర్గాలను కూడా పరిగణనలోకి తీసుకుంటే, తొంభైశాతం సీట్లు వారి పరమైనట్లే భావించాలి. కాంగ్రెస్ అత్యంత దయనీయమైన స్థితిలో, కనీసం ప్రతిపక్షం హోదాను కూడా నిలబెట్టుకోలేని హీన



పరిస్థితిలో కొన వూపిరితో కొట్టు మిట్టాడుతున్నది.

కురుక్షేత్ర సంగ్రామంలో ఒకరి వెంట ఒకరుగా నేలకొరిగిన కౌరవ సైన్యం ... కూలిపోతున్నారు కాంగ్రెస్ నాయకులందరూ. పెద్ద పెద్ద తలలు నేల వాలిపోయాయి;మీసాలు త్రిప్పి, వీరంగాలాడిన వారందరూ తోకలు ముడిచి సిగ్గు ...లో ముసుగులు కప్పేశారు. కాంగ్రెస్ నాయకులకు కళ్లు బైర్లు క్రమ్మేటట్లు

తరువాయి 12 పేజీలో

# కాంగ్రెస్‌హంతకులువీరే!

రాష్ట్రంలో కాంగ్రెస్ చచ్చి పోయింది; చచ్చిపోయిందనడం కంటే చంపబడిందనడం సమంజసం. అవును కాంగ్రెస్‌ను ఘోరంగా హత్య చేశారు; పాశవికంగా ఖండ ఖండాలుగా తెగనరికారు. ఈ మహా పాతకానికి



ఒడిగట్టిన వారు- ప్రతిపక్ష నాయకులుకాదు; విపక్ష పార్టీలూ కాదు; కాంగ్రెస్ నాయకులే కాంగ్రెస్ పార్టీని నిలువునా పాతిపెట్టారు. కాంగ్రెస్‌ను అసరాగా చేసుకొని పదవీభోగం అనుభవించిన వారే హంతకులుగా మారారు. ఈ హత్యానేరం మీద ఏ ప్రజాన్యాయ స్థానంలోనైనా విచారణ జరిపించ వలసివస్తే, మొదటి ముద్దాయిలుగా

## ఏ శిక్ష విధించాలి?

బోనులో నిలబడ వలసినవారు - ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కరరెడ్డి, నిత్య అసమ్మతి నేత డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి లిద్దరే!

రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ ఓడలేదు- ఓడించబడింది; ప్రజలు తమంతట తాముగా కాంగ్రెస్‌ను ద్వేషించలేదు - వారిలో ఆ ద్వేష భావం ప్రేరేపించ బడింది. ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి గారు పార్టీకి చేసిన ద్రోహం ఇంతా, అంత కాదు. ఎన్నికలు కను చూపుమేరలో పెట్టుకొని ఆయన తన వ్యక్తిగత దురహంకారం కాపాడు కోవడానికి కాంగ్రెస్ వాదులందరినీ పీడించి, వేధించి, అవమానాల పాల్జేశారు. అందరితో తగువు పెట్టుకొని, ఎవ్వరితో రాజీపడే తత్వం లేకుండా నియంతృత్వంతో వ్యవహరించారు. ఫలితంగా ప్రతి నిత్యం పత్రికలలో కలహాలు, కీచులాటలు ప్రథమ స్థానం ఆక్రమించి ప్రజలలో కాంగ్రెస్‌పట్ల జుగుప్సాకర భావాలు పెరిగిపోయాయి. ఆయనకు సరిజోడి- రాజశేఖరరెడ్డి. ఆయనకు పార్టీ ఏ గంగలో కలిసినా లక్ష్యంలేదు. తను, తన వర్గం క్షేమంగా వుంటే అంతేచాలు!



ఈ కక్షలు కార్పణ్యాలతోనే, కలతలు కీచులాటలతోనే కాంగ్రెస్ అధికారంలో వుండిన పుణ్యకాలం గడచి పోయింది. కనీసం ఎన్నికల సమయంలోనైనా ఈ నాయకమ్మన్యు లిద్దరూ పార్టీక్షేమం కాంక్షించివుంటే, కాంగ్రెస్ ఇంత ఘోరంగా ఓడిపోయి వుండేది కాదు. కాని అధికార దాహంతో అహంకార తత్వంతో కళ్లు

తరువాయి 11 పేజీలో

# కాంగ్రెస్ సౌధం నేలమట్టం!

## జిల్లాలో తెలుగు మోజు ఉప్పెనవలె విరుచుకపడింది!

ఊహించినట్లే జరిగింది; నెల్లూరు జిల్లా అంతా పచ్చ జెండా రెప రెప లాడింది; సైకిల్ రేసు గుర్రం వలె దౌడు తీసింది.



టి. రమేష్‌రెడ్డి

పోలింగుకు నాలుగు రోజుల ముందు 29 తేది సంచికలోనే వ్రాశాము.

"జిల్లా వ్యాప్తంగా తెలుగుదేశం గాలి మహా ప్రచండంగా వీస్తూంది; అవకాశం లభించక ఆ ప్రభంజనం బయట పడటం లేదు కాని, లోలోపల ఓటర్ల మనస్సుల్లో గిరికీలు కొడ్తున్నది; సుడి తిరుగుతున్నది. పోలింగ్ నాటికి బూత్‌ల దగ్గర ఆ పెనుగాలి ఉధృతంగా బయట



వెంకటగిరి రాజా

పడవచ్చు" అని

పోలింగ్ తర్వాత కూడా మా అభిప్రాయం స్పష్టంగానే వ్యక్తం చేశాము. 2 తేది సంచికలో, రేసు గుర్రం వలె దౌడు తీసిన సైకిల్ శీర్షిక క్రింద

"స్థూలంగా పోలింగ్ తీరును ఒక్క మాటలో విశ్లేషించి చెప్పాలంటే సైకిల్ రేసు గుర్రం వలె దౌడు తీసిందనే చెప్పాలి; జిల్లా అంతటా పచ్చట పసుపు మబ్బులు క్రమ్ముకున్నాయని వ్యాఖ్యానించాలి. పదకొండు నియోజక వర్గాలలోనూ అదే పరిస్థితి. కాంగ్రెస్ పట్ల ఆగ్రహం, ఎన్టీఆర్ గారి రెండు రూపాయల బియ్యం పట్ల అనురక్తి ఓటర్లలో ప్రస్ఫుటంగా వ్యక్తమైనాయి. కాంగ్రెస్ నాయకులు కోపగించు కోవచ్చునేమో గాని, జిల్లాలో

పలికారు. మేము ఏదో ఉద్దేశ్యం మనసులో పెట్టుకొని తెలుగు దేశాన్ని నైతిక వ్రాస్తున్నామని నిందించారు. కాని ఫలితం మా అభిప్రాయాన్ని బలపరచింది; అంత కంటే ఎక్కువగా



సోమిరెడ్డి చంద్ర మోహన్‌రెడ్డి

కూడా వుండింది - తెలుగుదేశం పట్ల జనం మోజు. పసుపు జెండా రెప రెప లాడుతుందని వూహించామే కానీ, అది

ఏకోన్ముఖంగా తెలుగుదేశాన్ని వరించారు. అందరి అంచనాలూ తల్లక్రిందులు చేశారు.

జిల్లాలోని పదకొండింటిలో ఒక్క కావలి కలికి యానాది రెడ్డి గా[illegible] మాత్రం బస్తీ మే సవాల్ అని కాంగ్రెస్‌ను గెల్పించుకొని వచ్చారు; తక్కినవన్నీ రామార్పణమై పోయాయి. అవి అర్పణమై నాయనడం కంటే, కాంగ్రెస్ వారులే కష్టపడి వాటిని తారక రాముడికి అర్పించా రనడం వాస్తవం. అనవసరమైన కక్షలు, కార్పణ్యాలు పెంచుకొని; జిల్లా కాంగ్రెస్ నాయకులు ఒకరినొకరు వెన్నుపోట్లు పొడుచు కొని తమను తాము చంపుకున్నారు. ఈ వెన్నుపోట్ల బెడద లేకుండా వుండి వుంటే, కనీసం ఐదు నియోజక వర్గాలలో కాంగ్రెస్ గెలుపొంది వుండేది. నెల్లూరు, ఆత్మకూరు, రాపూరు, అల్లూరులలో కళ్ల ముందు కాంగ్రెస్ విజయావకాశాలు చేజారాయి. సర్వేపల్లి, కోవూరు,

గల్గిన తాము మరి కాంగ్రెస్ వారి సహకారమూ అభ్యర్థించ వలసిన [illegible] లేదని భావించి, తమను [illegible] ఎక్కువగా అంచనా వేసుకొని ఓటమి చవి చూశారు వారు. కేవలం



ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి

డబ్బుతో ఎటువంటి వారినీ లొంగ దీయగలమన్న దురభిప్రాయం వారి ఓటమికి దారి తీసింది. టౌన్‌లో కొద్ది గొప్పో ప్రభావం కల్గిన రాజకీయ వారులను, కార్యకర్తలను కలుపుక పోవడానికి ప్రయత్నించి, వారి

## కలికి ఒక్కడు గెల్చి పరువు నిల్పాడు!

తెలుగుదేశం గాలి ప్రచండంగా వీచిందన్నమాట నిజం. ఒక పార్టీగా కాంగ్రెస్‌ను ప్రక్కకు నెట్టి తెలుగుదేశాన్ని పీఠం ఎక్కించడానికే ఓటర్లు నిర్ణయం తీసుకున్నారన్నది అర్థమౌతున్నది".

పోలింగుకు ముందు, [illegible] మేము వెలిబుచ్చిన అభిప్రాయా[illegible] నిజమైనాయి. ఆ రెండు సంచికలు చూసిన కొందరు పాఠకులు, ముఖ్యంగా కాంగ్రెస్ రాజకీయ వాదులు మా మీద అభాండాలు వేశారు, నిష్ఠూరాలు

కొంత ఉధృతంగా వుంటుందని మేమూ భావించలేదు.

"ఒక్క వెంకయ్యగారి గెల్చే ఛాన్స్ వుందంటే, జిల్లాలో



కలికి యానాది[illegible]

తెలుగు గాలి ప్రభావం పూర్తిగా వచ్చునని"

గత వారం సంచికలో మేము వ్యక్తం చేసిన సందేహమూ నిజమైంది; అనుకున్నట్లే జరిగింది. జిల్లాలో కాంగ్రెస్ సౌధం సమూలంగా నేల మట్టమైంది; పునాదులతో సహా పెకిలింప బడింది. జిల్లా మీద తెలుగు మోజు ఉప్పెన వలె విరుచుక పడింది.

అయితే వెంకటగిరి, రాపూరు విషయంలో మాత్రం మా అంచనాలు తల్లక్రిందు లైనాయి. ఈ రెండు నియోజక వర్గాలలో కాంగ్రెస్ కొద్దిలోనైనా గెలుపొంద వచ్చునని మేము వూహించాము. పరిస్థితులు అట్లనే [illegible] వర్గాల బలా బలాలు, [illegible] సామర్థ్యం వంటి అంశాలు పరిగణనకు తీసుకున్నప్పుడు గెలుపు సాధ్యమే అనిపించింది. కాని [illegible]

వెంకటగిరి, సూళ్లూరు పేట, గూడూరు, ఉదయగిరిలలో ముఠా కక్షలు, వెన్నుపోట్ల స్థాయిని మించి ఓటర్లు తెలుగు దేశాన్ని ఆదరించినా తక్కిన ఐదూ కాంగ్రెస్ పరమై వుండేవి.

మాగుంట సుబ్బరామ రెడ్డి గారు ఏ దుర్ముహూర్తంలో కాంగ్రెస్ పార్టీలో ప్రత్యేక వర్గం ఏర్పాటును సంకల్పించారో గాని, అదే చివరకు పార్టీకి సమాధి కట్టింది. తనను వ్యతిరేకించే వారెవ్వరూ ఎన్నికలలో గెలవడానికి లేదని, రాజకీయంగా [illegible] లేదని పంతం పట్టి, విద్రోహ [illegible] కొనసాగించిన తీరు పార్టీకి తీరని అపకారం చేసింది. రాపూరు, వెంకటగిరి, గూడూరు, సూళ్లూరు పేట, కోవూరు, సర్వేపల్లి నియోజక వర్గాలలో ఆయన లక్షలకు లక్షలు [illegible] గుమ్మరించారు. తెలుగుదేశం అభ్యర్థులు ఒక్క పైసా కోసం వెతుక్కో వలసిన అవసరం లేకుండా సంచుల నిండా అందించారు. ఒక్క వ్యక్తి వ్యక్తిగత అహంకారానికి ఒక జిల్లా మొత్తంలో పార్టీ తుడిచి పెట్టుకొని పోవడం శోచనీయమైన విషయం.

నియోజక వర్గాల వారీగా చూస్తే నెల్లూరు టౌన్‌లో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పి.వి. ప్రసన్నకుమార రెడ్డి పరాజయం కేవలం స్వయంకృతాపరాధం. మాగుంట కుటుంబం పై జనంలో వుండే క్రేజ్‌తో ఓట్ల వర్షం కురుస్తుందని; 30, 40 వేల మెజారిటీతో సునాయాసంగా గెలవ

సహకారాన్ని అభ్యర్థించి వుంటే ఈ పరిస్థితి ఏర్పడేదే కాదు.

నెల్లూరు టౌన్ కాంగ్రెస్‌కు సుస్థిరమైన స్థానం. ఏ గాలి వీచినా ఓటర్లు కాంగ్రెస్ విలువ గ్రహించి, గుర్తించి ఓటు వేయడం అలవాటు.



కొమ్మి లక్ష్మయ్య నాయుడు

అందువల్లే 1985 లోనూ ఇక్కడ కాంగ్రెస్ గెలుపొందింది. వ్యక్తులుగా తమ కంటే, పార్టీ ఎప్పుడూ గొప్పదనే వాస్తవం జ్ఞప్తిలో వుంచుకొని ప్రవర్తించి వుంటే ఇప్పుడూ కాంగ్రెస్ కోల్పోవలసిన స్థానం కాదు నెల్లూరు. ప్రసన్న కుమార రెడ్డి వ్యక్తిగా మంచి వాడు, సమర్థుడు, కానీ అదృష్టం కలిసి రాలేదు; స్వంత పొరపాట్లు విజయావ కాశాలను హతం చేశాయి.

తెలుగుదేశం అభ్యర్థి శ్రీ టి. రమేష్ రెడ్డి విజయానికి కేవలం అదృష్టమే కారణం. అభ్యర్థిగా ఆయనకు అన్ని కలిసిన పరిస్థితులే

మిగతా 7 పేజీలో

# రోదసీ విద్రోహం

తిరువనంత పురంలోని రాకెట్ పరిశోధనా కేంద్రం నుంచి పిఎస్ఎల్‌విికి సంబంధించిన రహస్య పత్రాలు దొంగచాటుగా పాకిస్తాన్‌కు చేరవేస్తున్నారన్న వార్త ప్రతి భారతీయుడికి ఆందోళన కల్గిస్తున్నది. తమ మేధస్సుతో అవిరళ కృషితో, అనుపమాన నైపుణ్యంతో ఆ శాస్త్ర పరిజ్ఞానాన్ని అన్వేషిస్తున్న శాస్త్రవేత్తలే శత్రు గూఢచారుల వలలో చిక్కారన్న వార్త మరీ అలజడి రేకెత్తిస్తున్నది.

తిరువనంత పురంలోని ఇస్రో కేంద్రంలో అత్యంతాధునిక క్రయోజనిక్ రాకెట్ ఇంజన్ల రూపకల్పనకు పరిశోధనలు జరుగుతున్నాయి. రష్యా, అమెరికా, యూరోపియన్ స్పేస్ ఏజెన్సీల వద్ద మాత్రమే ఇప్పుడీ పరిజ్ఞానం వుంది. భారీ ఉపగ్రహాలను అంతరిక్షంలోకి పంపడానికి, ఛాలెంజర్ వంటి ఉపగ్రహ వాహక నౌకలను నడపడానికి ఈ ఇంజన్లు అవసరం. రష్యానుంచి మన మీ పరిజ్ఞానం పొందడానికి ఒప్పందం చేసుకున్న తరుణంలో అమెరికా అడ్డంపడి, దాన్ని నిలిపివేసింది. ఒప్పందం సమయంలో రష్యా మనకు అందజేసిన ప్రాథమిక డ్రాయింగ్‌ల ఆధారంగా మనంతట మనం ఆ క్రయోజనిక్ ఇంజన్లు తయారు చేసుకోవడానికి ఈ కేంద్రంలో "లిక్విడ్ ప్రొపల్షన్ సిస్టమ్స్ సెంటర్" (ద్రవరూప ఇంధన వనరుల కేంద్రం) స్థాపించారు. 1997-98 లోగా ఇంజన్ రూపకల్పన పరిజ్ఞానం సంపాదించాలని లక్ష్యంగా పెట్టుకొని శాస్త్రవేత్తలు అహో రాత్రులు పనిచేస్తున్నారు. పిఎస్ఎల్‌వి రాకెట్ ప్రయోగం సఫలం కావడంతో, దానికి సంబంధించిన తదుపరి పరిశోధనలూ ఇక్కడ జరుగుతున్నాయి. పిఎస్ఎల్‌వికి సంబంధించిన సమగ్ర సమాచారం ఇక్కడ వుంది. ఈ విభాగం అధిపతి, డాక్టర్ ఎస్. నంబి నారాయణన్! రష్యా నుంచి ఒప్పందం రద్దుకు ముందు క్రయోజనిక్ ఇంజన్‌కు సంబంధించి అందిన అతికొద్ది కీలక సమాచారం అతడి దగ్గరేవుంది. దురదృష్టవశాత్తు ఇప్పుడీ శాస్త్రచౌర్య కుంభకోణంలో అతడొక కీలక పాత్రధారి అని రుజువైంది. అతడి సమస్థాయిలో వున్న మరొక డిప్యూటీ డైరెక్టర్ డి. శశికుమారన్ కూడా ఈ కుంభకోణంలో పాల్గొన్నట్లు సందేహం వుంది. కేరళ ఇన్స్‌పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ రామన్ శ్రీవాత్సవ వీరికి తోడు దొంగ అన్న అనుమానం తలెత్తింది.

మాల్దీవ్స్‌కు చెందిన మరియం రషీదా, ఫౌసియా హసన్ అనే ఇద్దరు స్త్రీలను, పాక్ గూఢచారులు ఈ శాస్త్రవేత్తలను లొంగదీయడానికి ప్రయోగించారట. శారీరక వ్యామోహంతో వీరు శాస్త్రవేత్తల... అధికార్లను వెర్రెక్కిస్తుంటే: ... మరొక విద్రోహ వారిని ... ముంచెత్తేవారు. ఐజిపి శ్రీవాత్సవ వీరి ద్వారా కొన్ని కోట్ల రూపాయల ఆస్తి సంపాదించాడట. శశికుమారన్ ఒకేసారి 32 లక్షల రూపాయల లంచం స్వీకరించాడని తేలింది. డబ్బుకు, స్త్రీ సుఖానికి లోబడి పోయిన ఈ నీచులు దేశ రహస్యాలను శత్రువుల చేతిలో పెట్టేశారు.

కొన్ని సంవత్సరాల నుంచి గుట్టు చప్పుడు కాకుండా జరిగిపోతున్న ఈ విద్రోహం కాకతాళీయంగా బయట పడింది. మరియం రషీదా వీసా గడువు తీరినా దేశం వదలి వెళ్లక పోవడంతో పోలీసులు ఆమెను అరెస్టు చేయడానికి వెళ్లే సరికి ఈ డొంకంతా కదలి వచ్చింది. ఈ నీచులు ఇప్పటికే రాకెట్ పరిజ్ఞానానికి సంబంధించిన రహస్య పత్రాలతో పాటు, జలాంతర్గాముల నుంచి సమాచార మార్పిడి చేసుకొనే ఒక ఆధునిక ప్రక్రియను, అత్యాధునిక రాడార్ వ్యవస్థ రూపకల్పనను పాకిస్తాన్‌కు చేరవేశారని అనుమానం. ఇవి రెండూ భారత శాస్త్రవేత్తల కృషి ఫలితంగా కనిపెట్టబడినవి; అమెరికాకు ధీటైన సాంకేతిక పరిజ్ఞానంతో రూపొందించబడినవి. ఏమాత్రం శ్రమ పడకుండా పాకిస్తాన్ వాటిని స్వంతం చేసుకోగల్గడం హేయమైన విషయం. వస్తున్న వార్తలు నిజమైతే, వీరిద్వారా దొంగిలించిన పత్రాలతో పాకిస్తాన్ మూడంటే మూడు నెలల్లో రాకెట్‌ను లేదా దూరశ్రేణి క్షిపణి తనకు తానుగా తయారు చేసుకోగలదని చెప్తున్నారు. మామూలు పరిస్థితిలో అయితే వారు, ఐదవయ్యేళ్లు తలక్రిందులు తపస్సు చేసినా ఆ పరిజ్ఞానం సంతరించుకోలేరు. అయితే కొందరు శాస్త్రవేత్తలు ఈ సమాచారాన్ని ఖండిస్తున్నారు. రాకెట్ రూపకల్పనకు 2800 డ్రాయింగ్‌లు వుంటాయని, వాటినన్నింటినీ బయటకు చేరవేయడం అసాధ్యమని, ఒకవేళ చేరవేసినా వాటిని ఆచరణలో పరీక్షించి చూసే పరికరాలు లభించడం దుర్లభమని, అందువల్ల ఈ శాస్త్ర చౌర్య కుంభకోణం గురించి భయ పడ వలసిన అగత్యం లేదని శాస్త్రవేత్తలు ధైర్యం చెప్తున్నారు.

ఈ నీచులు ఎన్ని పత్రాలు చోరీ చేశారు, ఎన్ని రహస్యాలు చేరవేశారు, వాటివల్ల జరిగిన నష్టమెంత అన్న మీమాంస కంటే, గౌరవ ప్రదమైన స్థానాల్లో వుండే శాస్త్రవేత్తలు కూడా స్త్రీ వ్యామోహానికి, ధన ప్రలోభాలకు లొంగిపోయి శత్రు గూఢచారుల చేతిలో కీలు బొమ్మలుగా మారారన్న విషయమే మనసుకు బాధ కల్గిస్తున్నది.

పరిస్థితి తీవ్రతను గమనించి ప్రధాని స్వయంగా జోక్యం చేసుకోవడంతో, సిబిఐ అధిపతి శ్రీ విజయ రామారావు గారే నేరుగా పరిశోధన చేపట్టారు. రాజకీయ ప్రలోభాలకు లొంగకుండా, నిజాయితీతో, నిష్పాక్షికతతో మొత్తం కుంభకోణాన్ని నిశితంగా పరిశోధించి, నిజమైన దోషులందరినీ వెలికి లాగడం అవసరం. వారెంత పెద్దవారైనా కఠిన శిక్షలు విధించడం తప్పని సరి. దేశ రహస్యాలు, రక్షణ వంటి కీలక విషయాలతో ప్రమేయం కల్గిన అధికారులు, వ్యక్తులను ఎప్పటి కప్పుడు గమనించి; వారిలో మానసిక బలహీనతలు తలెత్తినా, పరిధికి ... సంపద కన్పించినా ఎప్పటి కప్పుడు నిఘా వేయడం అవసర మన్పిస్తున్నది. ... ఇప్పటి వలె చేతులు ... కాలిన తర్వాత ... ఆకులు పట్టుకో... వస్తుంది.

జమీన్‌రైతు

దేశ రహస్యాలను అమ్మేశారన్న కోపంతో, మొత్తం ఇస్రో సిబ్బందిని, శాస్త్రవేత్తలను వెలి వేసినట్లు చూస్తున్నారట కేరళ ప్రజలు. అది వారి దేశ భక్తికి, జాతీయతా భావాలకు సూచిక వంటిదే అయినా; ఒకరిద్దరు చేసిన తప్పుకు శాస్త్రవేత్త లందరినీ దేశ ద్రోహులుగా పరిగణించడం సమంజసం కాదు. దేశ ప్రతిష్ఠను పెంచి, రక్షణను సుదృఢం చేయడంలో తమ మేధస్సు సంతటినీ అర్పించిన వారు - ప్రజల నుంచి ఛీత్కారాలు పొంద వలసి రావడం దురదృష్ట కరం. ప్రజలు కూడా విచక్షణతో వ్యవహరించాలి.

---

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

**జమీన్‌రైతు**

8-12-94

8 పేజీలు వె ల 0-1-6

### నెల్లూరు జిల్లా ధాన్యం ఉత్పత్తిదార్ల సభ

10-12-44 3గం. నెల్లూరు టౌన్ హాలులో

అధ్యక్షులు; శ్రీవంగల్లు కోదండ రామిరెడ్డిగారు

ప్రాసంగికులు: శ్రీ నన్నపనేని వెంకట సుబ్బయ్యగారు

ఆచార్య రంగాగారు కూడా సభలో ఉపన్యసిస్తారు. అన్ని గ్రామాల నుండి రైతులు విచ్చేయ ప్రార్థన.

ఎ.సి.సుబ్బారెడ్డి

ఆహ్వాన సంఘాధ్యక్షుడు

### శ్రీ శొంఠి రామమూర్తిగారు

మద్రాసు ప్రభుత్వ అడ్వయిజరుగ శ్రీ శొంఠి రామమూర్తి గారు 11-వ తేదీన చార్జి పుచ్చుకొందురని తెలియు చున్నది.

### కల్లు మానండి

వాగిరెడ్డి గూడెంలో కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమం

పశ్చిమ గోదావరి జిల్లా వాగిరెడ్డి గూడెంలోని లంబాడీ తండాలో 50 కుటుంబములలో 200 జనాభా వున్నది. ... వీరు ఆధార పడకుండా జీవించ డానికి తగిన ఆర్థిక సంపత్తి యున్నది. కాని వీరంతా త్రాగుడు, దొంగ తనాలకు బాగా అలవాటు పడ్డారు. వీరిలో త్రాగుడు, దొంగతనాలు మాన్పించ డానికి ఖద్దరు కట్టించ డానికి ప్రాథమిక విద్య వయోజన విద్య ప్రవేశ పెట్టడానికి శ్రీ గద్దే విష్ణుమూర్తి గారు వగైరా చింతల పూడి కాంగ్రెసు వాదులు గత 15 రోజులుగా లంబాడీలతో చర్చలు జరుపు చున్నారు. లంబాడీలు ఈ విషయంలో చాలా ఉత్సాహంగా యున్నారు.

### శాంతిదూతా! గాంధీ!!

మునిపల్లి కుటుంబరావు

(జాతీయ రచనా మండలి, బందరు)

"సర్వమంగళనామా" మాదిరి.

సర్వమానవకోటి సంరక్షా గాంధి
సర్వలోక శాంతిదూతా గాంధి గాంధి
పిరికి రక్తము పారద్రోలి గాంధి గాంధి
పోరగా నీ జ్యోతిజూపి గాంధి గాంధి
హిందు ముస్లిముల హితబుద్ధి మాపిమాకు
హితపు మార్గము చూపుమయ్య గాంధి గాంధి
జాతి మత హింస ...

---

# నోటిఫికేషన్ రోజే ప్రభుత్వాలను రద్దుచేయాలి!

ఎన్నికల కమీషన్ ఎన్నికలకు నోటిఫికేషన్ జారీ చేసే రోజే రాష్ట్ర ప్రభుత్వాలు రద్దయ్యే నిబంధనను రాజ్యాంగంలో పొందు పరచాలి. ఎన్నికలు గవర్నర్ పర్యవేక్షణలో జరిపితే బాగుంటుంది. లేకుంటే అధికార దుర్వినియోగానికి అడ్డూ, ఆపూ లేకుండా పోతున్నది. శేషన్ నిబంధనావళిని, కలెక్టర్ సాంబశివ రావు, నిర్భీతితో అమలు పరచిన విధానాల వల్ల జిల్లాలో స్వేచ్ఛగా ఎన్నికలు జరిగాయి. కాని విపరీతమైన ధన ప్రవాహాన్ని ఆపలేక పోయాయన్నది మాత్రం వాస్తవం. జిల్లాలో పోలీసు శాఖ వ్యవహరించిన తీరుపై అనేక విమర్శలు చెలరేగాయి. రాష్ట్ర ప్రభుత్వం తన ఇష్టానుసారం అధికార యంత్రాంగం చేత విచ్చలవిడి అక్రమాలకు ఒడిగట్టింది.

ఇస్కపాలెం -డి.రాధాకృష్ణారెడ్డి

### విజయభాస్కరరెడ్డి తీరు బాగోలేదు

రాష్ట్రంలో ... పార్టీ ... విజయం సాధించి అధికారం చేపడు తుందని ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయ భాస్కర రెడ్డి నందికొట్కూరు సభలో ప్రకటించారు. అంత వరకు బాగానే వుంది. ఎవరికీ అభ్యంతరం లేదు. అయితే అదే సభలోనే కోట్ల వారు మరో మాట కూడా సెలవిచ్చారు. ఈసారి కూడా తానే ముఖ్యమంత్రిగా కొనసాగుతానని చెప్పారాయన. పోలింగ్‌కు మూడు రోజుల ముందు ఇటువంటి వివాదాస్పద ప్రకటన చెయ్యడం బాగోలేదు. ఈ ప్రకటన పార్టీ విజయానికి ఏ మాత్రం వుపకరించక పోగా పార్టీ అధిష్టాన వర్గాన్ని ఇరుకున పెట్టింది.

నెల్లూరు -కె.వి. రాఘవులు

## జనవాణి

### గాంధీ గారు బ్రతికుంటే అల్లాడి పోయేవారు!

డిసెంబరు 1 తేదీ పోలింగ్ తంతు ... చూస్తుంటే ... ప్రభుత్వమే సహకరించిందనే అనుమానం రాక తప్పదు. నెల్లూరు టౌన్‌లో 80 శాతం మేరకు పోలింగ్ బూతులలో ఒక్క కానిస్టేబిల్ కూడా కనపడలేదు. పోటీ చేసిన అభ్యర్థులు రావణ ప్రీతిగా పోలింగ్ చేసుకొన్నారు. మహాత్మా గాంధీ గారే బ్రతికి వుంటే ఈ ప్రజాస్వామ్యాన్ని చూసి ఎంత అల్లాడి పోయే వారో! శేషన్ నిబంధనలు ఎన్నికల ముందు రోజు నుంచి తుంగలో త్రొక్కేసారు. ఎన్నికల ముందు నీతులు వల్లించే రాజకీయ పార్టీలు ఎన్నికల సమయంలో చీమ, నెత్తురు లేని వాటిలా ప్రవర్తిస్తాయి. ఓట్లే వీరికి బుద్ధి చెప్పే ఆయుధాలు. అయితే వాటిని కొంత మంది ప్రజలు అమ్ము కోవడం దారుణం.

నెల్లూరు -గునుపాటి వేణుగోపాల్

### అన్నా డి.ఎం.కె. తీరు బాగోలేదు

శాసన సభ ఎన్నికల్లో నెల్లూరు జిల్లాలోని సూళ్లూరు పేట, ఏర్పూరు

కొంప 8 పేజీలో

# అద్భుతమైనమల్లయుద్ధనైపుణ్యమున్నా...

వ్యక్తిలో ఎంత ప్రతిభ దాగి వున్నా, తగిన గుర్తింపు, ఆదరణ లేకుంటే దానికి విలువే వుండదు. ఆ వ్యక్తులు ఎప్పటికీ వెలుగులోకి రాలేరు. సాన బట్టకుంటే వజ్రం కూడా పిచ్చి రాయి మాదిరే కన్పిస్తుంది కదా; గుర్తించకుంటే మాణిక్యం కూడా మట్టిలోన పడి వుంటుంది కదా!

డివి శేషయ్య అటువంటి మట్టిలో మాణిక్యం వంటివారు. అపారమైన మల్ల యుద్ధ ప్రావీణ్యం ఆయన స్వంతం; కాని ఆయనలో అది దాగుందని, అంతటి ప్రవీణుడు తమ ప్రక్కనే అనామకంగా బ్రతికేస్తున్నాడని ఎవరికీ తెలియదు. అది శేషయ్య దురదృష్టమా? లేక ఆయన నైపుణ్యాన్ని గుర్తించి, గౌరవించ లేని నెల్లూరు దౌర్భాగ్యమా?

డి.వి. శేషయ్య నెల్లూరీయుడు; కావలి తాలూకా బ్రాహ్మణ క్రాక ఆయన స్వగ్రామం. నలభై ఎనిమిదేళ్ల వయస్సు, ఒక విరాగి వలె, ఏమీ తెలియని అనామకుడి వలె, మైపాడు గ్రామంలో రోజులు గడిపేస్తున్న శేషయ్య; మొదటి నుంచి ఆయనకు వ్యాయామ పోటీల పట్ల ప్రత్యేక ఆసక్తి. ఆ ఉత్సాహంతోనే సైన్యంలో జరిగే పోటీల్లో పాల్గొని పలు విజయాలు సాధించారు. 1965లోనే రక్షా మెడల్ లభించింది. ఆ తర్వాత సమర సేవాస్టార్ పొందారు. ఆ స్ఫూర్తితో, గుజరాత్‌లోని జామ్ నగర్ వ్యాయామశాలలో చేరి కుస్తీపట్టు

## ఆదరణకరవై...

నేర్చుకున్నారు. 1969లో ఢిల్లీలో జరిగిన వ్యాయామ పోటీలలో పాల్గొని 'మిస్టర్ నార్త్ ఇండియా' టైటిల్ గెల్చుకున్నారు. 1970లో బెంగుళూరులో 'మిస్టర్ ఎయిర్ ఫోర్స్'గా ఎన్నికై గౌరవం అందుకొన్నారు; అదే సంవత్సరం సర్వీసెస్ కలర్స్ పతకం లభించింది. తర్వాత ఢిల్లీలో జరిగిన వేరొక పోటీలో 'మిస్టర్ సర్వీసెస్' గౌరవమందుకొన్నారు. మిస్టర్ మహారాష్ట్ర, ప్రత్యేకంగా సన్మానించింది. ఇటు వ్యాయామం, అటు బాడీ బిల్డింగ్, మధ్యలో కుస్తీ పట్లు మూడింటిలోనూ అప్పటి కాయన ఆరి తేరారు. 1973లో మిస్టర్ ఢిల్లీగా ఎన్నికైనారు. అయితే ఆ దశలో ఆయన దృష్టి ఆర్ఎస్ఎస్ వైపుకు ఆకర్షింప బడింది. సమాజ సేవ చేయాలనే తలంపుతో సైన్యాన్ని వదలి పెట్టాడు. ఈలోగా ఎమర్జెన్సీ వచ్చింది; జైలు పాలైనాడు. దానితో ఇటు సైనికోద్యోగం, అటు వ్యాయామ క్రీడా గౌరవం రెండూ కోల్పోయాడు.

మధ్యలో సినిమా ఛాన్సులు వచ్చాయి. అర్జా జనార్ధన రావు స్ఫూర్తితో సినిమా వేషాలు పొందాడు. చిన్న చిన్న వేషాల నుంచి, 1976లో ప్రతిష్టాత్మకమైన కురుక్షేత్రం సినిమాలో భీముడుగా సెలక్టయినాడు. కాని, షూటింగ్ సమయంలో జైలుకు పోవడం వల్ల ఆ ఛాన్సు మిస్సయి పోయింది. ఆ తర్వాత అడపా దడపా ఒకటి రెండు సినిమా, టివి అవకాశాలు





కూడా కొనసాగి దేశం గర్వించదగిన క్రీడాకారుడుగా వెలుగొందే వాడు. కాని దురదృష్టం వెన్నంటి సైనికోద్యోగం వదిలేయడంతో భవిష్యత్ నిరామయమై పోయింది. ఈ పరిణామాల వల్ల ఆసియా క్రీడలకు సెలక్ట్ కాలేక పోయాడు. బాగ్దాద్, కౌలాలంపూర్‌లలో జరిగిన పోటీలూ మిస్ అయ్యాడు. సైన్యం నుంచి రిటైరైనా, ఆయనకు మాజీ సైనికో ద్యోగులకు వచ్చే సౌకర్యాలేవీ అందలేదు. ఇప్పటికీ

అవి సక్రమంగా నడవడం లేదు. [illegible] ప్రారంభించి, ఆ తర్వాత ఉద్యోగ వేటలో వదిలేసి వెళ్లి పోవడం వల్ల అవి నిర్వహణ లోపంతో చతికిల బడినట్లున్నాయి.

నెల్లూరులో ఇప్పుడు మళ్లీ పూర్తిస్థాయి వ్యాయామశాలను స్థాపించి, ఆధునిక పరికరా లన్నింటినీ సమకూర్చి యువకులకు శిక్షణ ఇవ్వాలన్నది శేషయ్యగారి సంకల్పం. ఆయనకు వయస్సు పైబడినా,

# తెరమరుగై పోయిన నెల్లూరు వీరుడు - డివి శేషయ్య!

శేషయ్య - ఇరవై రెండేళ్ల క్రితం మిస్టర్ ఇండియాగా ఎన్నికైన ఘనుడని చెప్పినా నమ్మలేము. కానీ అది నిజం. దేశం గర్వించ దగిన మల్ల యుద్ధ ప్రావీణ్యం వుంది ఆయనలో! ఆ క్రీడలో ఆయన పొందిన గౌరవాలు, గెల్చిన పోటీలు, సాధించిన పతకాలు అసంఖ్యాకం.

పద్దెనిమిదేళ్ల పసి వయస్సులో, డిగ్రీ చదువు మధ్యలో ఆపేసి, 1964లో సైన్యంలో చేరారు శ్రీ కాశ్మీర్ ఛాంపియన్, మిస్టర్ ఆంధ్ర వంటి బిరుదులు అసంఖ్యాకం. పాల్గొన్న ఏ పోటీలోనూ పరాజయం ఎరుగని నిపుణుడుగా గుర్తింపు తెచ్చుకొన్నాడు.

ఈ గౌరవాలకు పరాకాష్ట - 72లో కలకత్తాలో లభించిన "మిస్టర్ ఇండియా" పతకం. అరుదైన వ్యాయామ ప్రావీణ్యం కలిగిన శేషయ్యను భారత సైన్యం - 1972 లో ఢిల్లీలో 25 వ స్వాతంత్ర్య దినోత్సవాలలో వచ్చినా గుర్తింపు కల్గిన సినిమా దేనిలోనూ పాత్రలు లభించలేదు. ఫలితం - పూర్తిగా తెరమరుగు కావడం.

అప్పటి నుంచి శేషయ్య గుర్తింపుకు, గౌరవాలకు దూరమై పోయారు. మాణిక్యంగా ప్రకాశించాల్సిన ప్రావీణ్యత మట్టిలో కలిసి పోయింది.

ఆయన సైన్యంలోనే కొనసాగి వుంటే, వ్యాయామ క్రీడలో అభ్యాసం ఎమ్మార్వో ఆఫీసు చుట్టూ తిరుగుతూనే వున్నాడు - భూమి అయినా ఇప్పించమని.

స్వంతంగా వ్యాయామశాలలు స్థాపించే ప్రయత్నమూ చాలాసార్లు చేశారు. 1964లో కావలిలో, 1980లో నెల్లూరులో, 1987లో వింజమూరులో వ్యాయామ శాలలు నెలకొల్పారు. అవి ఇప్పటికీ నడుస్తున్నాయి. అయితే సరైన పర్యవేక్షణ లేక, క్రమశిక్షణ లోపించి, ఉత్సాహం తరగలేదు. నైపుణ్యం క్షీణించలేదు. ఆయన నుంచి శిక్షణ పొందిన వారు చాలామంది సైన్యంలో, పోలీసు శాఖలో ఉద్యోగాలు సంపాదించారు. ఇటు యువకులలో ఆరోగ్యం పెంపొందింప జేయడం, అటు మల్ల యుద్ధ క్రీడలో నైపుణ్యం ద్వారా శారీరక పటుత్వం పెంచడం లక్ష్యాలుగా తన కొత్త వ్యాయామ శాల పని చేస్తుందని చెప్తున్నారాయన.

కరవ 10 పేజీలో

# ష ణ్ము గు డు

## * ఓటరుతెలివిమీరలేదు- నాయకులకేబుద్ధిరాలేదు!
## * అంతఆవేశంఎందుకండీ?

శేషన్ ఎంత అరిచి గీ పెట్టినా, రాజకీయ పార్టీలు తమ వైఖరి మార్చుకోలేదు. డబ్బుతో ఓట్లను కొనాలన్న దుర్బుద్ధి మానలేదు. కుక్క తోక వంకరనైనా సాఫీగా చేయ వచ్చుకాని, రాజకీయ వాది ఆలోచనల్లోని వక్రతను మాత్రం సరిదిద్ద లేమని ఈ ఎన్నికలూ రుజువు చేశాయి.

డోలేంద్ర

ఎన్నికలలో ధన ప్రవాహాన్ని, ధనప్రభావాన్ని నిరోధించ డానికి శేషన్ ఎంత గట్టి ప్రయత్నం చేశాడిసారి! అంతా ఆఖరి రోజు బూడిదలో పోసిన పన్నీరైంది. నిక్కచ్చిగా వ్యవహరించిన అధికారులూ చివరలో చేతు లెత్తేశారు. ప్రచారం, ప్రకటనలు, ప్రదర్శనలు తదితరాలను నియంత్రించడంలో అధికారులు విజయం సాధించి నట్టె లెక్క. రాష్ట్ర మంతటా శేషన్ భూతం అభ్యర్థుల గుండెల్లో గుబులు రేపితే నెల్లూరు జిల్లాలో మరీ ప్రత్యేకంగా కలెక్టర్ భయం వారికి నిద్ర పట్టకుండా చేసింది. సాంబశివ రావు గారు తాను నవ్వుతూనే అభ్యర్థులను ఎంత ఏడ్పించాడో చెప్పలేము. ఎన్ని నిర్బంధాలు, నియంత్రణలు? ఎన్నెన్ని నోటీసులు జారీ చేశారో లెక్కలేదు. ప్రతి అభ్యర్థి వెనుకా ఒక వీడియో గ్రాఫర్‌ను తోకవలె పంపి, జాగ్రత్త అన్నట్లు హెచ్చరించారు. ఇంత చేసి ఏమి లాభం? చివరి రోజు ద్రవ్యం ద్రవం వలె పారి జిల్లా అంతా లక్షలకు లక్షలు చిత్తుకాగితాలవలె పంచి పెట్టారు; వెదజల్లారన్నా ఆశ్చర్యం లేదు.

నెల్లూరు టౌన్‌లో ఒక అభ్యర్థి తరఫున 29తేది ఒక బ్యాంకు 7[?] లక్షల రూపాయలకు చిల్లర జారీ

కరవ 7 పేజీలో

## టౌన్‌అభివృద్ధే మా ధ్యేయం- డిఎస్‌పి ఉవాచ!

గాంధీ బొమ్మ వద్ద నుంచి న్యూటాకీస్ వరకు ఏర్పాటు చేసిన డివైడర్లను డిఎస్పీ లక్ష్మిరెడ్డి 3 తేదీ ప్రారంభించారు. పట్టణానికి అవసరమైన పనులు చేయడమే తమ ధ్యేయంగా, బాధ్యతగా పెట్టుకొన్నట్లు చెప్పారు. టౌన్‌లో ట్రాఫిక్ సిగ్నల్స్ ఎంతగానో వుపయోగ పడుతున్నాయి; ప్రజల సహకారంతో తమశాఖ ఈ పనులు చేయగల్గు తున్నట్లు వివరించారాయన. కేటాయించిన ప్రదేశాల్లో పార్కింగ్ చేయని వాహనాల పై పన్ను విధించి, నాలుగు లక్షల రూపాయలు వసూలు చేసినట్లు ట్రాఫిక్ సిఐ రాజ్‌కుమార్ చెప్పారు. మోహన్ స్టోర్స్ ఆర్థిక సహాయంతో ఈ డివైడర్లను ఏర్పాటు చేశారు. కార్యక్రమంలో ఎస్.ఐ.లు హసనయ్య, విజయ భాస్కర రెడ్డి, రజనీ కాంత్ రెడ్డి, మోహన్ స్టోర్స్ అధినేత కృష్ణమోహన్, కర్నాటక బ్యాంక్ మేనేజర్ రమేష్ తదితరులు పాల్గొన్నారు.

* * *

## నెల్లూరు సంగతులు

కండలేరు ముంపు గ్రామాలకు చెందిన రైతులు సోమవారం నెల్లూరులో ఒక ప్రదర్శన నిర్వహించారు. 500 మందికి పైగా బాధితులు ఇళ్లకు, భూములకు నష్ట పరిహారం చెల్లించాలని నినాదాలు చేస్తూ గాంధీ విగ్రహం నుంచి ఎసి బొమ్మ, ఆత్మకూరు బస్టాండ్, అంబేద్కర్ విగ్రహం మీదుగా కలెక్టర్

### జనవరిలోగా కండ్లేరు సమస్యల పరిష్కారం!

కార్యాలయానికి చేరారు. కలెక్టరేట్ వద్ద ధర్నా జరిపి కలెక్టర్‌కు వినతి పత్రం అందజేశారు. డ్యామ్ మునక గ్రామాల పేదల ఇళ్లకు నష్టపరిహారం ఇవ్వాలని, అసైన్‌మెంట్ స్కీమ్ భూములకు పరిహారం, దానిమ్మ చెట్లకు 45 వేల రూపాయల జి.ఓ.ని అనువర్తింపచేయాలని డిమాండ్ చేశారు. అన్ని గ్రామాల ప్రజలకు పునరా వాసం కల్పించాలని, పాక్షిక మునక గ్రామాల్లో మునకలేని భూములకు కూడా నష్ట పరిహారం చెల్లించాలని కోరారు. జనవరిలోగా సమస్యలు పరిష్కరిస్తామని కలెక్టర్ ప్రదర్శకులకు హామీ ఇచ్చారు. ప్రదర్శనలో కంచలపల్లి, కమలిగుంట, సుద్దమల్ల, లింగపాళెం, ఓబులాయ పల్లి, [illegible]రు, కొల్లవ నాయని పల్లి, పెనుబర్తి గ్రామాలకు చెందిన ప్రజలు పాల్గొన్నారు. ప్రదర్శనకు ఆంధ్రప్రదేశ్ రైతు కూలీ సంఘం, ప్రగతి శీల మహిళా సంఘం నాయకులు నాయకత్వం వహించారు.

* * *

### వేదం వారితోనే శతజయంతి సభలు మొదలు

కళాప్రపూర్ణ వేదం వెంకట రాయ శాస్త్రి జయంతి సభ 27 తేది టౌన్‌హాల్‌లో రీడింగ్ రూంలో వర్ధమాన సమాజం అధ్యక్షులు పి.వి. రమణా రెడ్డి అధ్యక్షతన జరిగింది. ముఖ్య అతిథిగా విచ్చేసిన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి మాట్లాడుతూ శత జయంతి సభలు నెల్లూరులో వేదం వారి సభలతోనే ప్రారంభ మయ్యాయి. శాస్త్రి గారు స్వయంకృషితో ప్రామాణికమైన వ్యాఖ్యలు రచించి ప్రచురించడంలో శృంగార నైషధం, ఆముక్త మాల్యద అందులోని కవితా సొగసులు సభూతో

కరవ 8 పేజీలో

# వెలుగొండ కొండల్లో దొంగసారా

దక్కిలి మండలంలోని వెలుగొండ కొండలు దొంగ సారా స్థావరాలయ్యాయి. సారా నిషేధించిన రెండో నెల నుండే ఒక ముఠా స్థానిక నాయకుని అండ దండలతో దొంగ సారా కాస్తోంది. ఇక్కడి నుండే అన్ని జిల్లాలకు సరఫరా చేస్తున్నది. వెలుగొండ దాటగానే కడప జిల్లా సరిహద్దు వుండడం వల్ల దొంగ సారా పెద్ద ఎత్తున ఇక్కడే అమ్ముడు పోతున్నట్లు తెలుస్తుంది. సారాను బాటిల్స్‌లో నింపి చీప్ లిక్కరు బాటిల్స్‌కు వుండే లేబిల్స్‌ను పోలిన వాటిని అతికించి అమ్ముతున్నారు. కొండ ప్రక్కన గ్రామాల్లోని ప్రజలందరికీ ఈ దొంగ సారా కాసే విషయం తెలిసినా అధికారులెవరూ పట్టీ పట్టనట్లు వ్యవహరిస్తుండడం వల్ల విషయాన్ని బయట పెడితే తమకు ఏదైనాప్రమాదం ముంచు కొస్తుందేమోనని వూరుకొంటున్నారు. జిల్లా వున్నతాధికారు లెవరైనా ఈ విషయమై దర్యాప్తు జరప వలసిన అవసరం ఎంతైనా వుంది.

* * *

# రాపూరులో పశువులకు డాకర్ కావాలి!

రాపూరులోని పశు వైద్యశాలకు డాక్టర్ లేక పోవడంతో ప్రజలు అనేక ఇబ్బందులు పడుతున్నారు. పొదలకూరు హాస్పిటల్ డాక్టరే ఇక్కడ ఇన్‌ఛార్జ్‌గా వుండటంతో ఆయన వారానికో, పది రోజులకో ఒకసారి ఇక్కడికి వస్తున్నారు. మిగతా సమయాల్లో హాస్పిటల్ అసిస్టెంట్ మందులిచ్చి పంపిస్తుంటారు. గత 15 రోజులుగా ఆ అసిస్టెంటు కూడా సెలవులో వుండడంతో రైతులకు ఇబ్బందిగా తయారయ్యింది. మండలంలో గాలికుంటు వ్యాధి తీవ్రంగా వుండడం, పశువులను తోలుకు వచ్చే రైతులు వుసూరు మంటూ డాక్టరు, మందులు లేక వెనుకకు వెళ్లడం జరుగుతున్నది. సమయానికి మూగ జీవాలకు వైద్య సౌకర్యం అందకచుట్టు ప్రక్కల గ్రామాల ప్రజలు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. వున్నతాధికారులు జోక్యం చేసుకొని ఇక్కడ వెంటనే డాక్టరును నియమించ వలసి వుంది.

* * *

# తుఫాన్‌ల నుంచి తుఫాన్ రక్షిత భవనాన్ని రక్షించండి!

తీరప్రాంతంలో పది కాలాల పాటు పదిలంగా వుండవలసిన తుఫాన్ షెల్టర్లు, ఏళ్లు గడవక ముందే అధ్వాన్న స్థితికి చేరుకొంటున్నాయి. ముత్తుకూరు బండ్లపాళెంలో రెండేళ్ల క్రితం తుఫాన్ షెల్టర్ కట్టారు. అత్యంత నాసిరకంగా నిర్మాణపు పనులు పూర్తి చేసి బిల్లులు పొందారు కాంట్రాక్టర్లు. గత నెలలో సంభవించిన తుఫాన్‌కు తల దాచుకోను వెళ్లిన ప్రజలకు మోకాలు లోతు నీళ్లతో స్వాగతమిచ్చింది షెల్టర్. ఇది ఎక్కడ కూలి పోతుందో నన్న భయంతో ఏ ఒక్కరూ దాని ఛాయలకూ పోలేదు. లక్షలాది రూపాయలు వెచ్చించి కట్టిన షెల్టర్ దేనికీ కొరకాకుండా పోయింది. సంబంధిత శాఖాధికారులు వెంటనే షెల్టర్ మరమ్మత్తులు చేయించాలని గ్రామస్తులు కోరుతున్నారు. కనీసం దాన్ని తుఫాన్‌ల నుంచైనా రక్షించండి. కూలిపోకుండా!

* * *

## కావలిలో ఆదర్శ వివాహం

కావలి కారొనేషన్ రీడింగ్ రూంలో అగ్రకులానికి చెందిన ప్రసన్న లక్ష్మీ, వెనుక బడిన తరగతులకు చెందిన విజయ భాస్కర్ వివాహం 5 తేదీ జరిగింది. అధ్యాపకులు, ప్రజా సంఘాల నేతలు, నాయకులు పెండ్లి పెద్దలుగా వ్యవహరించారు. కార్యక్రమానికి మున్సిపల్ మాజీ ఛైర్మెన్ డాక్టర్ ఎన్. ప్రభాకర నాయుడు అధ్యక్షత వహించారు. పౌర హక్కుల సంఘం కార్యదర్శి పి. సుబ్రహ్మణ్యం పెండ్లి ప్రమాణం చేయించారు. రీడింగ్ రూం అధ్యక్షుడు డాక్టర్ పి. వెంకారెడ్డి, న్యాయవాది సి.హెచ్. వెంకటరావు తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. వధూవరుల తల్లి తండ్రులు మాత్రం గైర్హాజ రయ్యారు.

## అల్లూరులో సైన్స్ ప్రదర్శన

అల్లూరు షెడ్యూల్ తెగల బాలుర వసతి గృహంలో 4 తేది సైన్సు ప్రదర్శన జరిగింది. ప్రదర్శనలో మండలంలోని హాస్టళ్ల విద్యార్థులందరూ పాల్గొన్నారు. సమాజంలో భూతాల పేరిట, బాబాల ముసుగులో సాగే అక్రమాల గూర్చి నెల్లూరు హెచ్.డి.ఎన్.ఓ. చంద్రశేఖర వివరించారు. మహిమలు, మూఢ నమ్మకాలను రూపు మాపేందుకు విద్యార్థులు ముందుకు రావాలన్నారు. అనంతరం దినచర్యలో సైన్సు అనే అంశం పై వ్యాస రచన పోటీ నిర్వహించారు. ఎస్.టి. బాలుర హాస్టల్ విద్యార్థి ఎ. శివకుమార్, ఎస్.సి. హాస్టల్ విద్యార్థిని ఎన్. సుజాత, ఎస్.సి. హాస్టల్ విద్యార్థి ఎన్. వరప్రసాద్‌లకు ప్రోత్సాహక బహుమతు లిచ్చారు. కార్యక్రమంలో వార్డన్ కృష్ణయ్య, వరిగొండ పాఠశాల ఉపాధ్యాయుడు శేషయ్య పాల్గొన్నారు.

## కావలి అభ్యర్థుల ఖర్చుల వివరాలు

కావలి అసెంబ్లీ ఎన్నికల్లో పోటీ చేసిన అభ్యర్థులు తమ జమా ఖర్చులను రిటర్నింగ్ అధికారికి సమర్పించారు. పోటీ చేసిన అభ్యర్థులలో ఎక్కువ ఖర్చును కాంగ్రెస్ అభ్యర్థి 'యానాది' రెడ్డి చూపారు. ఆయన మొత్తం ఖర్చు 92, 190 రూపాయలు కాగా, దేశం అభ్యర్థి వేణుగోపాల రెడ్డి రూ.91, 919 ఇండిపెండెంట్ అభ్యర్థి కొండప నాయుడు రూ.83, 541 ఖర్చు చేసినట్లు పేర్కొన్నారు. బిజెపి అభ్యర్థి కె. సత్యనారాయణ, 56, 422, సమాజ్ వాది పార్టీ అభ్యర్థి జమ్ము కొండయ్య 54, 023 రూపాయలకు లెక్క చూపారు. ఇండిపెండెంట్ అన్నం మాలకొండయ్య 10, 924, టి డేవిడ్ పరంజ్యోతి 3, 727, మూలపరపు వెంకయ్య 7, 545, నరసింహం 6, 033, సయ్యద్ హుస్సేన్ 1, 450 రూపాయల లెక్కలు రికార్డులో నమోదు చేసినట్లు

కొరవ 11 పేజిలో

## నెల్లూరు బులెటిన్
### విశ్లేషకుడు

### ఇంజనీరింగ్ కాలేజికి అనుమతి లేదు

నెల్లూరు కాబా ఎడ్యుకేషన్ సొసైటీ నెలకొల్పిన కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్‌కు తమ అనుమతి లేదని హైదరాబాద్ జె.ఎన్.టి.యు రిజిష్ట్రార్ శ్రీ జి. అరవింద గోష తెలుపుతున్నారు. అంటే ఇక్కడ చదివే వారికి డిగ్రీలు రావన్నమాట. వ్యాపారం కోసం ఆ సంస్థ చేసే ప్రకటనలు, ప్రలోభాల నుంచి విద్యార్థులు జాగ్రత్త పడాలి.



### కస్తూరి దేవి ఎదురుగా బాలుడి దుర్మరణం

కస్తూరిదేవి విద్యాలయం ఎదురుగా 8 తేది సాయంత్రం జరిగిన ఒక రోడ్డు ప్రమాదంలో అబ్దుల్ రహమాన్ అనే ఎనిమిదేళ్ల పసి పిల్లవాడు దారుణ మరణానికి గురైనాడు. అదే స్కూలులో చదువుతున్న ఆ పిల్లవాడు, బడి వదలగానే ఇంటికి వెళ్లడానికి గేటు దాటి రోడ్డు పైకి వచ్చాడట. పార్శిల్ వ్యాన్ ఒకటి భూతం వలె వచ్చి త్రొక్కేసింది. మెదడు చితికి, ఘోరంగా చనిపోయాడు.

కస్తూరిదేవి సెంటర్ రోడ్డు ప్రమాదాలకు కేంద్రమై పోతూంది. కనీసం స్పీడు బ్రేకరైనా ఏర్పాటు చేయకూడదా?

### సబిత చావు- హత్యా? ఆత్మహత్యా?

నెల్లూరు మూలపేటలో వుంటున్న సబిత అనే వివాహిత యువతి తన చీరతోనే వురి పోసుకొని మరణించింది. ఆమె మెడిసన్ నాలుగవ సంవత్సరం విద్యార్థిని కూడా!

ఆమె చావు పై చాలా అనుమానాలు తలెత్తు తున్నాయి. ఆమె భర్త నిర్మల బాబు ఆమెను చంపి, ఈ నాటకం ఆడుతున్నా డన్నది ఒక సందేహం. లోతుగా విచారిస్తే చాలా ఆసక్తికర అంశాలు వచ్చేట్లున్నాయి. సవివరంగా పై వారం ముచ్చటించు కుందాం.

### మరణం

నెల్లూరులో పేరున్న డెంటిస్టు, పార్ట్ టైం పొలిటీషియన్ డాక్టర్ జి. కొండా రెడ్డి గారి తల్లి శ్రీమతి సరోజనమ్మ మరణించారు. ఆమె వయస్సు 68 సంవత్సరాలు. ఇద్దరు కొడుకు లున్నారామెకు.

* * *

ఆత్మకూరు పాత సమితి అధ్యక్షుడు, ఆత్మకూరు తాలూకా రాజకీయాలలో పాత తరంలో కీలక పాత్ర వహించిన నాయకుడు స్వర్గీయ పండ్లూరు వెంకట సుబ్బారెడ్డి భార్య యశోదమ్మ (70) 1 తేది మరణించారు. ఆమెకు ఒక కుమారుడు, ఆరుగురు కుమార్తెలు.

పై కుటుంబాల వారికి మా సానుభూతి.





## మెజారిటీలు

7పేజీ కొరవ

పోలైన ఓట్లు : 94.277
చెల్లనివి : 1.120
చేవూరు దేవకుమార్‌రెడ్డి (కాం) 25.860
**నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి (తె.దే.) 60.442**
చిలుకోటి వరదయ్య (బిజెపి) 5.508
పి. చెంచలబాబు (బిఎస్‌పి) 469
అగరాల ఐజాక్ (స్వ) 62
జి. హరిప్రసాద్ రెడ్డి (స్వ) 10.
జె. మదన్‌మోహన్ రెడ్డి (స్వ) 60
టి. కృష్ణయ్య (స్వ) 202
జె.ఎన్. మిల్టన్ (స్వ) 136
టి. ఏడుకొండలు (స్వ) 268
**మెజారిటీ: 34.582**

### ఆత్మకూరు

మొత్తం ఓట్లు: 1.47.374
పోలైన ఓట్లు : 1.08.449
చెల్లనివి : 1.769
డాక్టర్ బి. సుందరరామిరెడ్డి (కాం) 41.214
**కొమ్మి లక్ష్మయ్య నాయుడు (తె.దే.) 58.687**
డి. రాధాకృష్ణారెడ్డి (బిజెపి) 4.862
టి. వెంకటేశ్వరరావు (బిఎస్‌పి) 1.557
బి. మోహన్ (స్వ) 296
వై. పుల్లయ్య (స్వ) 43
ఆర్. మాలకొండయ్య (స్వ) 171
ఎ. దాసయ్య (స్వ) 53
బి. సుందరరామిరెడ్డి (స్వ) 118
మెజారిటీ : 17.473

### రాపూరు

మొత్తం ఓట్లు : 1.54.415
పోలైన ఓట్లు : 1,15,361
చెల్లనివి :
ఆనం రామనారాయణ రెడ్డి (కాం) 43.791
**ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి (తె.దే.) 52,180**
ఎం. రమేష్ (బిజెపి) 2.508
కోసూరు వెంకటస్వామి (సమతాపార్టీ) 195
రావుల అంకయ్య గౌడ్ (స్వ) 12.401
రావుల అంకమ్మ గౌడ్ (స్వ) 295
రావుల దశరథరామయ్య గౌడ్ (స్వ) 60
కె. బ్రహ్మయ్య (స్వ) 1.063
కె. నవకోటి (స్వ) 380
జి. సుబ్బరామరాజు (స్వ) 81
కె. పెంచలయ్య (స్వ) 202
**మెజారిటీ : 8.389**

### సర్వేపల్లి

మొత్తం ఓట్లు : 1.49.745
పోలైన ఓట్లు : 1.11.178
చెల్లనివి : 1.969
సివి శేషారెడ్డి (కాం) 35.054
**ఎస్ చంద్రమోహన్ రెడ్డి (తె.దే.) 69,347**
ఎ. శ్రీనివాసులు (బిజెపి) 3,367
బి.ఎ.హెచ్.పి. ప్రసాద్ కుమార్ (బిఎస్‌పి) 982
పి. కరుణాకర్ (స్వ) 838
కె. రామకృష్ణ (స్వ) 244
ఎం. హరి కోటేశ్వరరావు (స్వ) 189
కె.ఎస్. రాజు (స్వ) 100
**మెజారిటీ : 33,775**

### గూడూరు

మొత్తం ఓట్లు : 1,58,726
పోలైన ఓట్లు : 1,12,063
చెల్లనివి : 1,558
పత్రా ప్రకాశరావు (కాం) 36,336
**బల్లి దుర్గాప్రసాద్ (తె.దే.) 64.706**
జోగి మస్తానయ్య (బిఎస్‌పి) 2.082
పి. రామచంద్రరావు (స్వ) 5.662
ఎస్. భానుప్రసాద్ (స్వ) 1.461
**మెజారిటీ : 28.360**

### సూళ్లూరుపేట

మొత్తం ఓట్లు: 1.42.117
పోలైన ఓట్లు: 1.05.593
చెల్లనివి : 1648
పసల పెంచలయ్య (కాం) 36.218
**పరసా వెంకటరత్నం (తె.దే) 63.219**
జి. సంపత్‌కుమార్ (బిజెపి) 1.419
టి. జానకిప్రసాద్ (బిఎస్‌పి) 1.363
కె. ప్రసాద్ (స్వ) 211
జి. రత్నం (స్వ) 1.435
వి. చలపతి (స్వ) 42
శ్రీపతిరాజు (స్వ) 82
**మెజారిటీ : 27.001**

### వెంకటగిరి

మొత్తం ఓట్లు : 1.39.957
పోలైన ఓట్లు : 1.11.831
చెల్లనివి : 1990
నేదురుమల్లి జనార్ధన రెడ్డి (కాం) 44328

కొరవ 7 పేజీలో

## కాంగ్రెస్ సౌధం

2 పేజీ కొరవ

అనుకూల వాతావరణమే. డబ్బు లేదు. పార్టీ నుంచి తోడ్పాటు లేదు. కార్యకర్తల బలం లేదు. ఎన్నికల యంత్రాంగం లేదు. ఆఖరుకు పోలింగ్ ఏజెంట్లు లేరు; కాని జనం ఓట్లు వేశారు, గెల్పించారు. ఎమ్మెల్యే కావాలన్న కోరిక రమేష్ రెడ్డిలో చిరకాలం నుంచి వుండింది. అప్పుడది తీరింది. బిజెపి అభ్యర్థి శ్రీ అమంచర్ల శంకర నారాయణ ఎంత కష్ట పడినా



కంభం విజయరామిరెడ్డి

బ్రాహ్మణుల ఓట్లే కాదు - బిజెపి ఓట్లు కూడా పొంద లేక పోయారు.

సర్వేపల్లిలో శ్రీ సోమిరెడ్డి చంద్రమోహన రెడ్డి గెలుపు వూహించినదే. కాని అంత భారీ మెజారిటీ అనూహితం. పోలింగ్ తర్వాత చంద్రమోహన రెడ్డి తనకు 25 వేలకు పై బడిన ఆధిక్యత వస్తుందని చెప్తే మాకే నమ్మ బుద్ధి కాలేదు. గెలుపు గ్యారంటీ కాని, మెజారిటీ పది వేల లోపుగా వుండవచ్చునని అంచనా వేశారందరూ. కానీ ఆయన నమ్మకమే నిజమైంది.



పరసారత్నం

గాలి వాటాన్ని బట్టి వెళ్లే నియోజక వర్గాల్లో సర్వేపల్లికి ఎప్పుడూ మొదటి స్థానం. 1972 నుంచీ అదే పరిస్థితి. రాష్ట్రంలో ఏ గాలి తోలితే, అక్కడా అదే వీస్తుంటుంది. ప్రచ్ఛన్నంగా తెలుగుదేశం గాలి రేకుతున్నదని పసి గట్టినప్పుడే



బల్లి దుర్గాప్రసాద్

అక్కడ కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ సివి శేషారెడ్డి ఓటమి, వూహించా రందరూ. ఆయనకు ఆశ వుండింది కాని, గ్రామాలలో తిరిగే వారెవ్వరికీ అనుమానం రాలేదు. అయితే ఒక ఎమ్మెల్యేగా ఆయన నియోజక వర్గానికి చేసిన సేవ, ప్రజలతో పెంచుకొన్న సంబంధాలు, అందుబాటులో వుండిన తీరు చూసిన వారికి శేషారెడ్డి ఓటమి బాధాకరమే.

తెలుగుదేశం గాలికి, మాగుంట సుబ్బరామ రెడ్డి, తాతా రెడ్డిల విద్రోహం కలగలవడంతో చంద్రమోహన రెడ్డి భారీ ఆధిక్యత సాధించారు. వ్యక్తిగా చంద్రమోహన రెడ్డి కూడా సామాన్యుడే; నియోజక వర్గంతో, ప్రజలతో సంబంధాలు కల్గిన వాడే. అటు కాంగ్రెస్‌లోని ఒక వర్గం, అటు తెలుగుదేశంలు రెండింటినీ సంతృప్తి పరుస్తూ పని చేయవలసిన బాధ్యత చంద్రమోహన్‌పై పడిందిప్పుడు. అసలే బక్క ప్రాణం. అంత బరువు ఎట్లా మోస్తాడో పాపం!

మాగుంట సుబ్బరామ రెడ్డి గారి కాంగ్రెస్ విద్రోహ కాండ కారణంగానే అభ్యర్థి బలైపోయిన నియోజక వర్గం - రాపూరు. రామ నారాయణ రెడ్డి గెలుపును అందరూ వూహించారు. వాతావరణం అట్లానే వుండింది. బలీయమైన పాపకన్ను వర్గం ఆయన్ను సమర్థించింది.



జక్కా వెంకయ్య

తెలుగుదేశం అభ్యర్థి శ్రీ ఎల్లసిరి శ్రీనివాసులు రెడ్డి సగం గ్రామాలలో పలుకరించే మనిషినే సంపాదించు కోలేక పోయాడు. ప్రచారం చేయలేక పోయాడు. అయినా అదృష్టం ఆయన్నే వరించింది.

ఎల్లసిరి గెల్చింది 8,800 ఓట్ల తేడాతో; అదే నియోజక వర్గంలో అంకయ్య గౌడ్‌కు వచ్చిన ఓట్లు 12 వేలు. సుబ్బరామ రెడ్డి గారు గౌడ్‌ను రెచ్చగొట్టి వుండకపోతే, ఇవన్నీ కాంగ్రెస్ ఓట్లు. అవి చీలి పోకుండా వుంటే కాంగ్రెస్ అభ్యర్థి సునాయాసంగా గెల్చి వుండేవాడు.

వెంకటగిరిలో జనార్థన రెడ్డి ఓటమి ఆశ్చర్య కరమైనది. ఆయన ఓడి పోవాలని అందరూ కోరుకున్నారే కాని, ఓడతాడన్న అనుమానం మాత్రం చాలామందికి లేదు. ఎమ్మెల్యేగా తాను ఆ నియోజక వర్గానికి చేసిన సేవ, అభివృద్ధి తనను గెల్పిస్తాయన్న ధైర్యంతో వుండినారాయన. గ్రామాలలో ఎవరిని కదిలించినా అదే అభిప్రాయం వ్యక్తం చేస్తుండినారు. కానీ వెంకటగిరి రాజా పట్ల మోజు ఆయన్ను తెరమరుగు చేసింది. ఎప్పుడూ ప్యాలస్ వదలి బయటకు రాని పెద్ద రాజా, తమ గడప దగ్గరకు వచ్చి ఓటు అడిగే సరికి ఓటరు తబ్బిబ్బు పడిపోయారు. జనార్థన రెడ్డిని మేము రెండు వారాల క్రితమే హెచ్చరించాం - రాచరికపు మోజు ప్రమాదకర స్థాయిలో కన్పిస్తున్నదని; కానీ అప్పటికే జరిగి పోయిన డ్యామేజిని పూరించు కోవడం ఆయన తరం కాలేదు.

గూడూరు, సూళ్లూరుపేటలలో తెలుగుదేశం గెలుపు నామినేషన్ల నాడే తెలిసిన నిజం. అందులో ఆశ్చర్యపడ వలసింది ఏమీ లేదు. పాపం పసల పెంచలయ్య ఐదేళ్లపాటు నియోజక వర్గానికి చేసిన గొడ్డు చాకిరీ దండగై పోయింది. దురదృష్ట వంతుడు.

ఆత్మకూరు డాక్టర్ బి. సుందర రామిరెడ్డి గారు గెల్చి తీరుతారనే అందరూ ఆశించారు. బిజెపి అభ్యర్థిత్వం, తెలుగుదేశం అభ్యర్థి కొమ్మి లక్ష్మయ్య నాయుడు పట్ల వుండిన వ్యతిరేకత దాన్ని బలపరచాయి. కాని ఆఖరి దశలో ఆనం సంజీవరెడ్డి గారు కోలుకోలేని పోటు పొడిచారు. డిసిసి అధ్యక్షుడుగా వుండి ఆయన చేయదగిన పని కాదది!

అయితే ఆనం వర్గం వెన్నుపోటుకు మించిన తేడాతో ఓడారు డాక్టరు గారు. మూడు టరమ్‌లు ఎమ్మెల్యేగా వుండిన వ్యక్తి పైన అసంతృప్తులు, అలుకలు సహజమే కదా!

ఉదయగిరిలో తెలుగుదేశం అనధికార అభ్యర్థి శ్రీ కంభం విజయ రామిరెడ్డి గెలుపు ముందుగా వూహించినదే! కానీ ఆయనకు దాదాపు 25 వేల మెజారిటీ రావడం ఆశ్చర్య కరం. వ్యక్తిగతంగా తనకున్న బలం, తనపై ఏర్పడిన సానుభూతి, రాజమోహన రెడ్డి సహకారం, కుల ప్రభావం కలగలిపి విజయ రామిరెడ్డి బండిని నల్లేరుపై నడిపించాయి.

మాదాల జానకిరాం అసహాయ శూరుడివలె పోరాడారు; రాజకీయ



నల్లపరెడ్డి ప్రసన్నకుమార్‌రెడ్డి

వీరస్వర్గ మలంకరించారు.

కోవూరులో నల్లపరెడ్డి ప్రసన్న కుమార్ రెడ్డి విజయమూ నిర్ణయమై రామచంద్రా రెడ్డి గారు పార్టీని అట్లా గాలికి వదిలేసి వెళ్ల వలసిన వారు పోయిన నిజమని ఎన్నికల ముందు నుంచే తెలుసు. అయితే కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ దేవకుమార్ రెడ్డి పట్ల కొంత ఆదరణ వున్నట్లు, సానుభూతి ఏర్పడినట్లు కన్పించింది. ఫలితం చూసిన తర్వాత అదంతా వట్టి భ్రమ అని తేలింది.

కొండప నాయుడు గారి స్వతంత్ర అభ్యర్థిత్వమే ఆయనను కాపాడింది. తెలుగుదేశం ఓట్లు 20 వేలను ఆయన చీల్చుకు పోవడంతో, యానాదిరెడ్డి గారు సాంప్రదాయ సిద్ధ కాంగ్రెస్ ఓట్లు కూడేసుకొని బయట పడ్డారు. అల్లూరులో విష్ణు ఓటమి కేవలం స్వయం కృతాపరాధమే. సులభంగా గెలువ వలసిన కాంగ్రెస్ స్థానం ఇది. కావి పదవి ద్వారా పదిమందిని సమకూర్చు కోవలసిన అవసరం విస్మరించి, అవకాశం చేజార్చుకొని; కారణం లేని స్పర్ధలతో అందరికీ విరోధిగా మారడం వల్ల అన్యాయంగా ఓటమి పాలైనారు. కనీసం స్వగ్రామమైన అల్లూరు వరకైనా శత్రుత్వాలు మరచి అందరితో కలిసిపోయి వుండినా తేలిగ్గా ఢకాయించి గెల్చి వుండేవారు.

కావలి సామ్రాజ్యంలో గాలులు, ధూళులు తననేమీ చేయలేవని సవాల్ చేసి మరీ నిరూపించారు కలికి యానాది రెడ్డిగారు. ముఖ్య అనుచరుల విద్రోహం, అనారోగ్యం వంటి అననుకూలత లన్నింటినీ అధిగమించి, తెలుగుదేశం అభ్యర్థి శ్రీ వంటేరు వేణుగోపాల రెడ్డి ధన ప్రభావాన్ని నిరోధించి గెలుపొందారు యానాది రెడ్డిగారు. జిల్లాలో తానొక్కడూ అయినా గెల్చి కాంగ్రెస్ పరువు నిల్పారు.

### సణుగుడు

4 పేజీ కొరవ

చేసిందట. ఒక్క నియోజక వర్గంలో ఒక్క అభ్యర్థి అంత సొమ్ము పంపకానికి సిద్ధం చేశాడంటే ఎన్నికలలో ధన ప్రవాహం ఎంత ఉధృతంగా వుండిందీ అర్థం చేసుకోవచ్చు.

కావలిలో తెలుగుదేశం అభ్యర్థి ఆ ఒక్క రాత్రి 30 లక్షలకు పైన పంచారట. సూళ్లూరు పేట, సర్వేపల్లి, ఉదయగిరి, రాపూరు తెలుగుదేశం అభ్యర్థులు కూడా పోటీలు పడి డబ్బు పంచారు. ఒక్క అల్లూరు మినహా జిల్లా అంతా కాంగ్రెస్ అభ్యర్థులు కరెన్సీ నోట్లను కరపత్రాల కంటే హీనంగా పంచి పెట్టారు . ఎవరూ పది లక్షలకు తక్కువ పంచ లేదు. 30, 40 లక్షల వరకు వెదజల్లినవారూ వున్నారు. అభ్యర్థులకు ఇంతింత డబ్బు ఎక్కడి నుంచి వస్తున్నది. ఎట్లా వస్తున్నది? ఎవరు ఇస్తున్నారు? లక్షలకు లక్షలు మంచినీళ్ల వలె ధారబోసి వీరు సాధించేదేమిటి? అంతంత డబ్బు తిరిగి రాబట్టే దెట్లా? సాధారణ ఎమ్మెల్యే పదవి అంతంత ధనార్జనకు అనువుగా మారిందా?

ఈ ప్రశ్నలన్నీ అవతల పెట్టండి- అభ్యర్థులు తమకు వుబ్బవుడియంగా వచ్చిన డబ్బును చిత్తు కాగితాల క్రింద విసిరేయడం తప్పు. ఈ ధన ప్రవాహపు ప్రభావం ఓటర్ల మీద వుందా అన్నది అసలైన ప్రశ్న. పసుపుపెట్టె, ఎర్ర పెట్టెల్లో ఓట్లేసే అమాయకపు రోజుల నుంచి ఈ ప్రశ్న విన్పడుతూనే వుంది; ప్రతి ఎన్నికలోనూ ఓటరు తన వైఖరిని స్పష్టం చేస్తూనే వున్నాడు. అప్పటి వరకు జరిగిన ఏ ఎన్నికలోనూ ఓటరు డబ్బుకు ప్రలోభపడి ఒక పార్టీని లేదా అభ్యర్థిని గెల్పించిన సాదృశ్యంలేదు. ఓటరు ఒకే విధంగా ప్రవర్తిస్తున్నాడు; నాయకుల బుద్ధే ఎప్పటికప్పుడు వక్రంగా వ్యవహరిస్తుంటుంది. వారి వాస్తవాన్ని గ్రహించేది లేదు. మారేదీ లేదు. ఎన్నికల్లో ధన ప్రభావం తగ్గించేదీ లేదు. రాజకీయ వాదులలో మార్పు రానంత కాలం ఎందరు శేషన్‌లు ఎంత అరాట పడినా ఈ దుర్వ్యసనం రాజకీయాల నుంచి తొలగే అవకాశం కన్పించడం లేదు.

* * *

మాగుంట సుబ్బరామ రెడ్డి గారు జమీన్‌రైతు మీద అమితంగా ఆయాస పడిపోతున్నారు. పోటీగా ఒక పత్రిక పెట్టి అణచి పారేస్తానని, కాళ్లు చేతులు విరిచేసి అంతం చూస్తానని పదే పదే చెప్తున్నారు. అధికారులను ఉసిగొల్పుతున్నారు. కన్పించిన ప్రతివాడి దగ్గరా ఆక్రోశం వెళ్లగక్కుతున్నారు.

ఆయన్ను చూస్తుంటే జాలి కలుగుతున్నది. రాజకీయంగా, వ్యాపార పరంగా అంత ఉన్నతికి ఎదిగిన వారు చిన్న పిల్లల మనస్తత్వంతో, తుంటరి మాటలు మాట్లాడుతుంటే జాలి కలుగకుండా ఎట్లా వుంటుంది?

జిల్లాలో కాంగ్రెస్ అభ్యర్థుల ఓటమికి డబ్బు అందించడం తప్పని వ్రాశాము; మేము నిరాధారంగా వేసిన నింద కానే కాదది. పది మందికీ తెలిసిన బహిరంగ రహస్యం. అన్ని దినపత్రికలూ విపులంగా వ్రాశాయి కూడా! ఆ తప్పును ఎత్తి చూపడం తప్పెట్లా అవుతుంది?

నెల్లూరు టౌన్‌లో కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ ఏ.ఏ. ప్రసన్న రెడ్డి ఓటమి నెదుర్కో బోతున్నారన్న మా ప్రమాద హెచ్చరికకు సుబ్బరామ రెడ్డి గారు పెడార్థాలు తీస్తున్నట్లున్నారు. మేమెప్పుడూ కాంగ్రెస్ అభ్యర్థి మంచి వాడు కాదని లేదా ఓడి పోవాలని అర్థం వచ్చేట్లు వ్రాయలేదు. కాంగ్రెస్ అభ్యర్థి ఓడిపోతున్నాడనే సూచనను మాత్రమే వ్యక్తం చేశాము. ఈ రెండింటికీ వ్యత్యాసం కనిపెట్టలేని అమాయకుడను కోవాలా ఆయన్ను!

ఈ వ్యాఖ్య వ్రాసేటప్పటికి ఎన్నికల ఫలితాలు వెలువడ లేదు. ఫలితాలు వెలువడిన తర్వాత అర్థమౌతుంది మా వార్తలోని నిజం!

ఒక పత్రికా యజమానిగా వుండి, సాటి పత్రికలో వ్రాసే వార్తలను సహృదయంతో స్వీకరించ లేక పోవడం దురదృష్టకరం; పూరకే ఆయాస పడి ఫలితమేమిటండీ సుబ్బరామ రెడ్డి గారు?

### మెజారిటీలు

7 పేజీ కొరవ

| | |
|---|---|
| ఏ.ఏ.ఆర్.కె. యాచేంద్ర (తె.దే) | 61,324 |
| ఆర్. కృష్ణయ్య (బిజెపి) | 1,725 |
| ఎ. ఈశ్వరయ్య (బిఎస్‌పి) | 1,775 |
| వేమారెడ్డి రామచంద్రారెడ్డి (స్వ) | 143 |
| పార్ల నితిన్ కుమార్ (స్వ) | 341 |
| ఎమ్. గోవిందయ్య (స్వ) | 390 |
| పూల వెంకటరత్నం (స్వ) | 75 |
| మెజారిటీ : | 16,996 |

### ప్రకటన

## నెల్లూరు సంగతులు

4 పేజీ కొరవ

సభవిష్యతి అయ్యాయన్నారు. పి.వి. రమణారెడ్డి మాట్లాడుతూ ఈ శతాబ్ది ఆరంభంలో దేశం నాల్గు చెరగులా ఆంధ్ర జాతి బుద్ధి కుశలతను, జాతి పౌరుషాన్ని ప్రతిబింబింప చేసినట్లు చెప్పారు. ముఖ్యోపన్యాసకులు కూరపాటి లింగరాజు గారు మాట్లాడుతూ, వేదం వారు ముద్రణా శాలలు ప్రారంభమైన తొలి దినాల్లో ఎన్నో సంస్కృతాంధ్ర గ్రంధాలు ప్రచురించి తెలుగు సరస్వతికి సేవ చేసినట్లు చెప్పారు. సమాజం కార్యదర్శి టి.వి. రసింహులు తొలుత స్వాగతం, చివరన కృతజ్ఞతలు చెప్పారు.

### వీళ్లు నలుగురినీ బహిష్కరించాలి!

అసెంబ్లీ ఎన్నికలకు గాను జిల్లాలో కాంగ్రెస్ పార్టీలో జరిగిన సెమ్మపోట్ల గురించి జిల్లా యూత్ కాంగ్రెస్ అధ్యక్షుడు సునీల్ కుమార్ రెడ్డి 5వ తేది ఇందిరా భవన్‌లో తన ఆవేదనను పత్రికల వాళ్ల ముందు వెళ్లగక్కాడు. వేమారెడ్డి రామచంద్రా రెడ్డి, మేనకూరు గోపాలకృష్ణా రెడ్డి, మాదాసు గంగాధరం, పెళ్లకూరు రామచంద్రా రెడ్డి గారలు కోవూరులో తమను ఓడించడానికి కృషి చేశారని ఆరోపించారు. కాంగ్రెస్ పార్టీ ద్వారా లబ్ది పొంది, పదవులను చేపట్టి దానినే అంతం చేయాలను కోవడం తల్లి పాలు తాగి రొమ్ము గుద్దినట్లుం దన్నాడు. వీరు నలుగురినీ పార్టీ నుంచి బహిష్కరించాలని కోరారు.

### యువజన వారోత్సవాలు

జాతీయ సమైక్యత, సమగ్రత లను యువతలో పెంపొందించ డానికి ప్రభుత్వం యువజన వారోత్సవాలు నిర్వహిస్తుంది. డివిజన్ స్థాయిలో గూడూరు, కావలి, నెల్లూరు పట్టణాల్లో 13 తేదిన 15 సంవత్సరాలు దాటిన, 35 సంవత్సరాల లోపు యువతీ, యువకులకు వివిధ అంశాలలో పోటీలు పెడతారు. జానపద నృత్యాలు, గీతాలు, ఏకపాత్రాభి నయం, సితార, ఫ్లూటు, తబలా, వీణ, మృదంగం, హార్మోనియం, గిటారు, భరత నాట్యం, కూచిపూడి నృత్యాలలోపోటీలు నిర్వహిస్తారు. డివిజన్ స్థాయి పోటీల్లో గెలుపొందిన వారికి జిల్లా స్థాయిలో 14, 15 తేదీల్లో కస్తూరిబా కళాక్షేత్రంలో పోటీలు పెడతారు. ఇక్కడా విజేతలైన వారిని రాష్ట్ర స్థాయి పోటీలకు పంపుతామని కలెక్టర్ ఎం. సాంబశివ రావు చెప్పారు.

### ముస్లింల ప్రదర్శన

రెండేళ్ల క్రితం బాబ్రీ మసీదును కూలగొట్టిన సంఘటనకు నిరసనగా జిల్లా మైనారిటీస్ వెల్ఫేర్ ఆర్గనైజేషన్, డి.వై.ఎఫ్.ఐ. టౌన్ కమిటీ వేరు వేరుగా 6 తేదీ ప్రదర్శన నిర్వహించాయి. కోటమిట్ట నుంచి ప్రారంభమైన ముస్లింల నిరసన ప్రదర్శన జిల్లా కలెక్టర్ కార్యాలయం వరకు సాగింది. డి.వై.ఎఫ్.ఐ. ప్రదర్శన గాంధీ బొమ్మ నుంచి బయలు దేరి చివరికి అక్కడికే చేరుకొంది. ముస్లిం ప్రతినిధులు జిల్లా కలెక్టర్‌కు వినతి పత్రం సమర్పించి దాన్ని ప్రధాని పివి నరసింహా రావుకు పంపమని కోరారు. దేశ స్వాతంత్ర్యం కోసం ప్రాణాలర్పించిన నాయకుల్లో ముస్లింలు ఎందరో వున్నారని, అటువంటి వారి పై మతోన్మాద శక్తులు కక్ష గట్టడం శోచనీయమని పేర్కొన్నారు. మసీదును కూల్చి వేసి రెండేళ్లు గడుస్తున్నా ప్రభుత్వం దానిని పునర్నిర్మించే విషయంలో చొరవ చూపక పోవడం అన్యాయమని వినతి పత్రంలో వివరించారు. ముస్లిం నాయకులు మొహియుద్దీన్, మాజీ కౌన్సిలర్లు సందాని భాషా, షఫీ, ఇబ్రహీం, డివైఎఫ్ ప్రదర్శనకు పట్టణ కమిటీ అధ్యక్ష, కార్యదర్శులు ఎం. రమేష్, నరహరి, పి.వి. రత్నం తదితరులు నాయకత్వం వహించారు

## జనవాణి

3 పేజీ కొరవ

జిల్లాలోని చిత్తూరు, తిరుపతి నియోజక వర్గాలలో తమిళనాడులోని ప్రాంతీయ పార్టీ అన్నా డి.ఎం.కె. తన అభ్యర్థులను నిలబెట్టింది. అందులో తప్పు లేదు గాని, తమిళనాడు మంత్రులు సూళ్లూరు పేట నియోజక వర్గంలో వారి పార్టీ తరఫున ప్రచారం చేస్తూ మంత్రి పెంచలయ్యను వాడు, వీడు అని తిట్టడం బాగోలేదు. జయలలిత తమిళనాడుకు అమ్మ అయితే కావచ్చు కాని తెలుగునాడుకు ఆమె అమ్మ కాదు. వచ్చే పార్లమెంట్ ఎన్నికల్లో పోటీ చేస్తామని ఆ పార్టీ వారు బెదరిస్తే, ఇక్కడ భయపడే వారు లేరు. మద్రాసులోని తెలుగు మంత్రి మధుసూదన్ ఆంధ్రులంటే జయలలితకు మక్కువ ఎక్కువని పేర్కొనడం పచ్చి అబద్ధం. తమిళనాడులో 42 శాతం మందిగా వున్న తెలుగు వారిని రెండవ తరగతి పౌరులుగా చూస్తున్నారు.వారి సమస్యల పరిష్కరించే నాధుడే లేడు. అదే విధంగా చిత్తూరు నియోజక వర్గంలో ఆ రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి ఇందిరా కుమారి ఏకంగా చిత్తూరు తమిళనాడులో వున్నట్లుందని వాఖ్యానించారు. వీరి ధోరణిని తెలుగు నాయకు లెవరూ ఖండించలేదు. ఈ విధమైన ప్రచారం అన్నా డి.ఎం.కె. మంత్రులకు తగదు.

నెల్లూరు -జి. వెంకటేశ్వర్లు

### కలశమహల్ నేలమట్టం బాధాకరం!

వెంకటగిరి దివాన్ రంతుల్లా సాహెబ్ నిస్వార్థంగా 130 సంవత్సరాల క్రితం నెల్లూరులో కలశ మహల్‌ను నిర్మించారు. టౌన్‌లో ఆ కట్టడం నిలిచి వుంటే అద్భుత అలంకారంగా వుండేది. ప్రస్తుతం అది దాయాదుల పోరులో నేలమట్ట మై పోతోంది. ఒక చారిత్రక కట్టడం నేల మట్టమై పోవడం ఆ దారిన ప్రతి రోజూ చూస్తూ వెళ్లే వారికి మాత్రం బాధను మిగులుస్తుంది.

నెల్లూరు -ఎస్.డి. అతావుల్లా

### ఎన్నికలు ప్రశాంతంగా జరిగాయా?

కరీంనగర్ జిల్లా మహదేవపూర్ అడవుల్లో పీపుల్స్ వార్ గ్రూప్ నక్సలైట్లు మందు పాతర పేల్చి ఎస్‌పితో సహా 16 మంది మృతికి కారకులయ్యారు. వారం తిరక్క ముందే మళ్లీ ఆత్మకూరు మండలం ఉదరకొండ గ్రామంలో కూడా మందు పాతర పేలి 10 మంది మరణించారు. సాక్షాత్తు ప్రధాని అల్లుడిని మూడు చెరువుల నీళ్లు త్రాగించి వదిలారు. ఈ విధంగా ఉత్తర తెలంగాణాలో మారణ హోమాలు జరుగు తుంటే, రాయలసీమ ప్రాంతంలో బాంబుల సంస్కృతి రాజ్యం చేస్తున్నది. ప్రతీక అంటూ కమలాపురం నియోజక వర్గంలో పెద్ద ఎత్తున బాంబులు పేలి ఒకరు మరణించడంతో పాటు అనేక మందికి గాయాలయ్యాయి. జమ్మలమడుగులో కాంగ్రెస్ అభ్యర్థి పై బాంబుల దాడి, నందలూరు శివార్లలో బాంబులు తయారు చేస్తూ పట్టుబడడం, తాడిపత్రి పట్టణం బాంబులలో దద్దరిల్లి పోవడం, కార్వేటి నగరం, తిరుపతిలో గొడవలు చూస్తుంటే ఎన్నికలు నిజంగా ప్రశాంతంగా జరిగాయా అన్న అనుమానం కల్గుతున్నది.

కావలి -పి. అనంతాచార్యులు

### ప్రేమికుడు చిత్రంలో చెన్నారెడ్డి విలనా?

ఆంధ్రప్రదేశ్‌లో గతంలో రాజకీయ యుద్ధానికి సినీ రంగాన్ని వాడుకొన్నా, ఇప్పుడు ఆ ధోరణి తగ్గింది. కాని ఈమధ్య ఆంధ్ర, తమిళనాడు రాష్ట్రాల్లో విడుదలైన ప్రేమికుడు (కాదలన్) తమిళనాడు రాజకీయ వర్గాల్లోను, మెద్రాసులోను సంచలనం సృష్టిస్తోంది. తమిళనాడు ముఖ్యమంత్రి జయలలితకు ఆ రాష్ట్ర గవర్నర్ చెన్నారెడ్డికి మధ్య తీవ్ర స్థాయిలో విబేధాలు కొనసాగుతున్న విషయం అందరికీ తెలిసిందే. రాష్ట్రాధినేత గవర్నరు పేరుతో ప్రేమికుడు చిత్రంలో ఒక పాత్రను సృష్టించారు. అతను ఆంధ్రరాష్ట్రం నుండి తమిళనాడుకు వలస వచ్చినట్లుచూపారు. చెన్నారెడ్డిని స్ఫురింపజేస్తూ తెల్లని లాల్చి, ధోవతి, చేతిలో పొన్నుగర్ర ఆ పాత్రధారిచేత ధరింపజేశారు. పైగా మద్రాస్ నగరంలో బాంబులు పెట్టి అవి పేల్చడంలో అతను ఎక్స్‌పర్ట్‌గా చూపారు. ప్రేమికుడు చిత్రంలో ఈ సన్నివేశాలు పెట్టడం వెనుక జయలలిత హస్తం వుందంటున్నారు. ఈచిత్ర నిర్మాత కుంజిమోహన్ జయలలిత వీరాభిమాని. ఈ చిత్రం తమిళనాడులో సంచలనం సృష్టిస్తున్నది. అసలు రాజ్యాంగానికి ప్రాతినిధ్యం వహించే వ్యక్తులను అప్రతిష్ట పాలుజేసే ఏ చిత్రానికి [illegible]ర్ సర్టిఫికెట్ ఇవ్వరాదని ఇటీవలె [illegible] సెన్సార్ బోర్డ్ ఆదేశాలు జారీచేసిన తరువాత ఈ చిత్రానికి సర్టిఫికెట్ ఇచ్చారు. ఈ విషయమై మద్రాసు ప్రాంతీయ సెన్సార్‌బోర్డు అడిషనల్ ఆఫీసరు వి.సి. రుక్మిణీ దేవిని పత్రికల వాళ్లు అడిగితే తాను ఈ సినిమా చూచిన వారిలో లేనని చెప్పారు. ఎలాగైతేనేం ఈ చిత్ర నిర్మాతకు జయలలిత నుండి పూర్తి సహకారం అందబట్టే ఈ చిత్రం విడుదలయ్యింది.

హైదరాబాద్ -ఎం.నరసింహారావు.

## పంచాంగం

### మహూర్తములు

11తేది ఆదివారం రా.గం. 7.45 లకు మిధున లగ్నమున వివాహ, గృహ ప్రవేశములకు సుమూర్తములున్నవి.

### మూలకార్తె

16తేది శుక్రవారం నుండి ధనుర్మాస ప్రారంభం. మూల కార్తె ప్రారంభం.

### డిసెంబర్ తిథులు

మార్గశిర శుద్ధ

తే10 శని అష్టమి రా.గం. 7.05వ

తే 11 ఆది నవమి రా.గం. 7.41వ

తే 12 సోమ దశమి రా.గం. 8.47వ

తే 13 మంగళ ఏకాదశిరా.గం10.20వ

తే 14 బుధ ద్వాదశి రా.గం. 12.15వ

తే 15 గురు త్రయోదశి రా.గం. 2.21వ

తే 16 శుక్ర చతుర్దశి రా.గం. 4.35వ

స్వయంపాకుల శ్రీనివాసులు యం.ఎ.

### నీటిమట్టం

| | |
|---|---|
| నెల్లూరు చెరువు | 16.2 అ |
| కనిగిరి రిజర్వాయరు | 19.0 అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 9.6 అ |

### నెల్లూరు బజారు

| | | |
|---|---|---|
| మొలగొలుకులు | 9674 | 4,800/- |
| | 9672 | 4,500/- |
| సున్నాలు | | 4,000/- |
| బియ్యం బస్తా 1క | | 650/- |
| బంగారు సవర (8గ్రా) | | 3,520/- |
| వెండి (10గ్రా) | | 68/- |


జమీన్‌రైతు

సంవత్సరచందా రూ. 100/-

అర్ధసంవత్సర చందా రూ.50/-

విడిప్రతిరూ. 2/-


## వేలం నోటీసు

### ఆత్మకూరు డి.ము. కోర్టులో

E.P. 35/92 :: O.S. 79/82

తుమ్మల సంపూర్ణమ్మ -DHr Vs తుమ్మల రామచంద్రా రెడ్డి - JDr

పై నంబరు E.P. మొత్తమును రాబట్టు కొనుట కొరకు జె.డి. తాలూకు క్రింది షెడ్యూలు దాఖలా భూములను పై కోర్టులో 21.12.94 తేది పగలు 10.30 గంటలకు వేలం వేయబడును. పాట పాడదలచిన వారు పాడుకొన వచ్చును.

### షెడ్యూలు

నెల్లూరు రిజిష్ట్రేషన్ డిస్ట్రిక్ట్ ఆత్మకూరు సబ్ రిజిష్ట్రేషన్, ఆత్మకూరు మండలం, పడకండ్ల గ్రామంలో జె.డి.కి హక్కు, అనుభవం గల స్థిరాస్తి వివరం.

| వ. నం. | పట్టా నం. | సర్వే నం. | పూర్తి విస్తీర్ణం | అనుభవం | తరగతి | అమీనా విలువ |
|---|---|---|---|---|---|---|
| 1. | 50 | 181-1 | Ac. 8.95 | Ac. 2.23 | మాగాణి | రూ. 40,000/- |

హద్దులు: తూర్పు: దాసరి చినకొండయ్య భూమి; దక్షిణం: పత్తి చినకొండయ్య భూమి; పడమర: పత్తి చినకొండయ్య భూమి; ఉత్తరం: తుమ్మల తిరుపాల్ రెడ్డి భూమి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 2. | 88 | 178 | Ac. 9.97 | Ac. 1.49 | మాగాణి | రూ. 25,000/- |

హద్దులు: తూర్పు: తుమ్మల పేరారెడ్డి భూమి; దక్షిణం: బంది [illegible] భూమి; పడమర: తుమ్మల తిరుపాల్ రెడ్డి భూమి; ఉత్తరం: మూలి వెంకటయ్య భూమి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 3. | 50 | 183 | Ac. 2.29 | పూరా | మాగాణి | రూ. 25,000/- |
| 4. | 50 | 206 | Ac. 7.94 | Ac. 1.98 | మెట్ట | రూ. 2000/- |

హద్దులు: తూర్పు: అయితా చిననరసయ్య భూమి; దక్షిణం: పోరంబోకు; పడమర: తుమ్మల తిరుపాల్ రెడ్డి భూమి; ఉత్తరం: తుమ్మల పేరారెడ్డి భూమి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 5. | 124 | 282 | Ac. 1.79 | Ac. 0.45 | మెట్ట | రూ. 500/- |

హద్దులు: తూర్పు: తుమ్మల పేరారెడ్డి భూమి; దక్షిణం మరియు పడమర: పోరంబోకు; ఉత్తరం: తుమ్మల తిరుపాల్ రెడ్డి భూమి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 6. | 124 | 283 | Ac. 6.33 | Ac. 1.58 | మెట్ట | రూ. 1000/- |

హద్దులు: తూర్పు: తుమ్మల పేరారెడ్డి భూమి; దక్షిణం మరియు పడమర: పోరంబోకు; ఉత్తరం: తుమ్మల తిరుపాల్ రెడ్డి భూమి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 7. | 197 | 305/2 | Ac. 2.25 | Ac. 0.56 | తోట | రూ. 3000/- |

హద్దులు: తూర్పు: మూలి వెంగటయ్య భూమి; దక్షిణం: తుమ్మల తిరుపాల్ రెడ్డి భూమి; పడమర: పోరంబోకు; ఉత్తరం: తుమ్మల తిరుపాల్ రెడ్డి భూమి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 8. | 197 | 207/2 | Ac. 4.07 | Ac. 1.01 | తోట | రూ. 10,000/- |

హద్దులు: తూర్పు: మూలి వెంగటయ్య భూమి. దక్షిణం: తుమ్మల తిరుపాల్ రెడ్డి భూమి. పడమర మరియు ఉత్తరం: తుమ్మల పేరారెడ్డి భూమి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 9. | 197 | 308/2 | Ac. 2.70 | Ac. 0.68 | తో[illegible] | రూ. 5000/- |

హద్దులు: తూర్పు: పోరంబోకు; దక్షిణం మరియు పడమర: తుమ్మల పేరారెడ్డి భూమి; ఉత్తరం: పోరంబోకు.

30 అంకణముల ఖాళీ స్థలములో గల రెండు పాడుబడిన పూరిల్లు రూ. 1000/-

హద్దులు: తూర్పు: తుమ్మల వెంచురామయ్య ఇల్లు; దక్షిణం: తుమ్మల పేరారెడ్డి; పడమర: తుమ్మల పేరారెడ్డి; ఉత్తరం: ఖాళీ స్థలం.

యస్. మహాదేవరెడ్డి, DHr అడ్వొకేట్

# శ్రీదేవిని చూడను తోసుకొని వచ్చిన శేషన్!

శ్రీదేవి పరిచయమున్న ప్రతివారితోనూ ఒక విషయం పని కట్టుకుని చెబుతోంది మధ్య: "విమానాశ్రయంలో ఉన్నట్టుండి చిన్న సందడి. అందరూ పక్కగా వెళ్లి నిలుచుంటున్నారు. ఎవరో ఒకాయన బాడీగార్డుల మధ్య హడావిడిగా నడుచు కుంటూ వస్తున్నాడు. దగ్గరకొచ్చాక గాని తెలియలేదు ఆయన మ చీఫ్ ఎలెక్షన్ కమీషనర్ శేషన్ అని. అప్రయత్నంగా ఆయన దృష్టి నా మీద పడింది. వెంటనే ఆగారు. బాడీగార్డులను తొలగించుకుంటూ ప్రక్కకు తోసేసి నా దగ్గరగా వచ్చి "నీ సినిమాలు చాలా చూశాను" అన్నారు హిందీలో. వెంటనే "అరే! నీకు తమిళం వచ్చు కదా?" అని, అదే మాటను తమిళంలోనూ చెప్పారు. "థ్యాంక్స్ సార్" అన్నాను. "విష్ యు ఆల్ ది బెస్ట్" అంటూ ఠీవిగా తన దారిన తాను వెళ్లిపోయారు. ఈ వ్యక్తేనా నేను రాజకీయ వేత్తలను, ఎన్నికలలో పోటీ చేస్తున్న అభ్యర్థులను హడల గొడుతున్నది - అనిపించింది" అన్నది శ్రీదేవి.

## అజ్ఞాతంలో నుంచి బయటపడ్డ దేవిక భర్త

నటి కనక పుట్టిన కొన్ని నెలలకు ఆమె తల్లి దేవిక, తండ్రి డైరెక్టర్ దేవదాస్ ఏవో మనస్పర్థలొచ్చి, విడిపోయారు. దేవదాస్ సినిమా రంగానికి దూరమయ్యారు. ఇంత కాలం తర్వాత కుమార్తె మీద ప్రేమ పుట్టుకొచ్చినట్లు "నా కూతురు కనక ఇంకా మైనరు, డబ్బు సంపాదించడం కోసం ఆ అమ్మాయిని దేవిక ఆట వస్తువులా ఉపయోగించు కుంటోంది. ఆ అమ్మాయి నా కస్టడీలోఉంచేలా కోర్టు వారు అనుమతించాలి" అంటూ కేసు పెట్టారు. దానితో దేవికకు గుబులు పుట్టుకొచ్చింది. ఇటీవల తన కూతురితో షూటింగ్‌కు వెళ్తున్నప్పుడు అండగా కొందరు బలిష్ఠులైన అంగరక్షకులను వెంట బెట్టుకొని వెళ్తున్నదామె.

## డిసెంబర్‌లో "పోకిరిరాజా"

"హిందీ మాతృక 'ఆంఖే' కన్నా చాలా బాగా వచ్చింది. మన ప్రేక్షకులకు నచ్చేలా కొద్ది పాటి మార్పులు చేశాం. నగర వాసిగా, పల్లెటూరి వాసిగా రెండు పాత్రలలో వెంకటేశ్ విజృంభించాడు" అన్నారు కోదండరామి రెడ్డి. ఈయన దర్శకత్వం వహించే పై చిత్రం డిసెంబర్‌లో విడుదల వుతుంది. రోజా, ప్రతిభా సిన్హా నాయికలు. సత్యనారాయణ, ఆలీ, శరత్‌బాబు, తనికెళ్ల భరణి, మహర్షి రాఘవ, మోహన్ రాజ్, అంజలీ దేవి, జ్యోతిలక్ష్మి, విచిత్ర సుధ, శుభశ్రీ పాత్రధారులు. మాటలు: పరచూరి సోదరులు, సంగీతం: రాజ్-కోటి.

## వాసు దర్శకత్వంలో తెలుగు చిత్రం

తెలుగులోకి అనువదింప బడిన "చిన్న తంబి, మన్నన్, వాల్టర్ వెట్రివేల్" వగైరా తమిళ చిత్రాలకు దర్శకత్వం వహించిన పి. వాసు దర్శకత్వంలో వి.ఎం.సి. దొరైస్వామి రాజా నిర్మించే చిత్రంలో నాగార్జున హీరో.

## కుంటికాలు వేషంతో నిజ జీవితంలో నటన

విలన్ వేషాలు వేసే రఘువరన్ సినిమాలలో కన్నా నిజ జీవితంలో బాగా నటించ గలనని నిరూపించు కున్నారు. "హైదరాబాద్‌లో ఒక తెలుగు చిత్రం షూటింగ్‌లో నేను పాల్గొంటూండగా హఠాత్తుగా సమ్మె ప్రారంభమైంది. మద్రాసు వారిని అక్కడ్నుంచి తరమ గొట్టేస్తారని ఒక పుకారు వ్యాపించింది. బ్రతుకు జీవుడా అని విమానాశ్రయానికి అదరా బాదరాగా చేరుకుంటే, టిక్కెట్ లేదన్నారు. నాకు ముందే చాలా మంది ఛలో మద్రాస్ అని టిక్కెట్ల కోసం చాలా సేపట్నుంచి పడిగాపులు పడ్తున్నారట. తటాలున నా మెదడులో ఒక ఆలోచన మెరిసింది. నా అసిస్టెంట్ భుజం మీదున్న తెల్ల తువ్వాలు లాక్కొని,

కొరవ 10 పేజీలో

# రోజా కారును రెడ్ లైట్ ఆపలేదు!

## మద్రాసు పోలీసుల గౌరవం!

నాయర్ రోడ్ నుంచి బయలు దేరిన ఆ ఎర్ర రంగు మారుతి కారును చూడగానే చౌరస్తాలో ఉన్న ట్రాఫిక్ కానిస్టేబిల్ అటెన్షన్‌లో నిలబడ్డాడు. రెడ్ సిగ్నల్ ఉన్నా ఆ కారు మాత్రం ఆగకుండా వెళ్లడానికి అనుమతి ఇచ్చాడు. కిటికీలకు చలువ అద్దాలున్నందువల్ల ఆ కారులో ఉన్నదెవరో ఇతర వాహన చోదకులకు తెలీడం లేదు. ఎవరైనా పోలీస్ ఆఫీసర్ అయి వుంటాడను కున్నారు కొందరు. కోడంబాకం చేరుకునే వరకు ప్రతి నాలుగు రోడ్ల కూడలి వద్దా ఆ కారుకు అదే మర్యాద. చివరికి ఆ కారు ఎ.వి.ఎం. స్టూడియోలోకి వెళ్లింది. ఒక ఫ్లోర్ వద్ద ఆగిన ఆ కారులోంచి రోజా దిగింది. దీపావళి, సంక్రాంతి పండగలప్పుడే కాక ట్రాఫిక్ కానిస్టేబుల్స్ ఎప్పుడు రోజా ఇంటికి వెళ్లినా, వొట్టి చేతులతో తిరిగి వెళ్లరట. అదీ విషయం.

# "మా పార్టీలో చేరితే మీ ఇన్‌కంటాక్స్ న్యూసెన్స్ తొలగిస్తాం!"

## జయప్రదకు ఎన్టీఆర్ హామీ?

ఆదాయపు పన్ను శాఖ వారికి బకాయి ఉన్న సినిమా తారల లిస్టు ఎప్పుడు ప్రకటించినా అందులో జయప్రద పేరు నెంబర్ - 1 గా ఉంటున్న విషయం అందరికీ తెలిసిందే. సంపాదించిన డబ్బులో అంత మొత్తాన్ని చెల్లించాలే అని ఆమె బాధ. ఒకసారి తలవని తలంపుగా ఎన్.టి.ఆర్.ని. కలుసు కున్నప్పుడు తన బాధను వెళ్లగక్కిందట. "నువ్వు మా పార్టీలో చేరు; తెలుగుదేశం తరపున ప్రచారం చెయ్యి. ముందు మన రాష్ట్రంలో కాంగ్రెస్‌ను దించేద్దాం. ఆటుపైన కేంద్రంలో పీఠాన్ని కదిలించేద్దాం. దాంతో ఆ చిక్కుల్లోంచి నువ్వు బయట పడగలవు" అని ఎన్టిఆర్ సలహా ఇచ్చారట. ఈ విషయమే ఆమెకు సన్నిహితులైన

ఒకరు చెప్తూ - "ఆ మాటలు నమ్మేసి, వెంటనే రంగంలోకి దిగింది. సినిమా షూటింగ్‌లు సమ్మె వల్ల ఆగిపోయినా - తాను ఎన్నో షూటింగులు రద్దు చేసుకుని ప్రచారానికి వచ్చినట్లు వేదికల మీద ఏకరువు పెడ్తోంది. ఇంత శ్రమపడి రేపు ఈమెకు ఒరిగేదేమీ ఉండదు" అన్నాడు.

మోహన్‌బాబు తెలుగుదేశం తరపున చేస్తున్న ప్రచారంలో కాంగ్రెస్ పెద్దలను నోటి కొచ్చినట్లు దూషిస్తుండడంతో ఆయన నటించిన "యం. ధర్మరాజా ఎం.ఎ." చిత్రాన్ని తెలుగుదేశం అభిమానులు తప్ప కాంగ్రెస్ అభిమానులు చూడడానికి ఇష్ట పడడం లేదన్న వార్తలు వస్తున్నాయి. సినిమా రంగంలో ప్రకాశించాలని అనుకుంటున్న జయప్రద ఈ విషయం గుర్తించడం మంచిది.



# నవ్వుల జల్లు: నమస్తే అన్న

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు గోపాలరావు

ఈ చిత్రానికి సంబంధించి తీపి కబురు ఒకటుంది. అది ఈ చిత్రం తాలూకు కథ వింటుంటేనే ఆనందం కలుగుతుంది. అంత వినోదంతో నిండిన కథతో కూడిన చిత్రాన్ని చూడాలని నోరు ఊరుతుంది. మనసు ఉబలాట పడుతుంది. ఈ చిత్రం చూసిన వారు ఒక వినోద విహారం చేసినట్టు ఆమందా నందాన్ని పొందుతారని చెప్పటానికి ఏ విధంగానూ సందేహించ నవసరం లేదు.

కథలోనే కాదు, కథా సన్నివేశాల్లోనూ వినోద ముంది. చమత్కారంతో పండిన తనికెళ్ల భరణి మాటల్లో వినోద ముంది. వేటూరి, అశోక్ తేజ పాటల్లోను ఉల్లాసంతో ఊగించే వినోదముంది. రాజ్- కోటి సంగీతంలో కమ్మదనం వుంది. హాస్య నటులైన బ్రహ్మానందం, బాబూమోహన్, గుండు హనుమంత రావు, ఆలి, వై. విజయ, హాస్య విలన్లు కోట శ్రీనివాస రావు, గిరిబాబు, తనికెళ్ల భరణి, నటనలో పెల్లుబికిన వినోదం వుంది. గౌరవ ప్రదమైన పాత్రల్లో కనిపించిన సత్య నారాయణ, సంగీత, కవిత, అన్నపూర్ణ నటనలో కూడా బరువు భారాన్ని కనుమరుగు చేసే వినోదం వుంది. ఇక హీరో హీరోయిన్లు సురేష్, రంభ [illegible] శృంగార చేష్టలతో ఉవ్విళ్లూరించే సంగతి వేరే చెప్ప పనిలేదు. ఇలా దర్శకుడు రంగారావు తన మెదడులోని పదునుతో ప్రతి అంశాన్ని వినోదంతో మిళితం చేసి మొత్తం చిత్రాన్ని ఒక వినోద ప్రపంచంగా తీర్చి దిద్దాడు.

"నమస్తే అన్న" చిత్రంలో కథేమిటంటే, గోపాల కృష్ణయ్య (సత్యనారాయణ) అనే సంపన్నుడికి బిడ్డలు లేక పోవటంతో రెండో పెళ్లి చేసుకుంటాడు. ఇందులో తమాషా ఏమిటంటే ఇద్దరు భార్యలూ ఒకేసారి గర్భం దాలుస్తారు (సంగీత, కవిత). మొదటి భార్య సంగీత సోదరుడు యాదగిరి (కోట శ్రీనివాసరావు) తన కొడుకు భువనగిరి (తనికెళ్ల) సహాయంతో గోపాల కృష్ణయ్య ఆస్తికి ఎసరు పెడ్తారు. అలాగే కవిత తమ్ముడు గిరి (గిరిబాబు) అతని భార్య (వై. విజయ) తోడుతో గోపాల కృష్ణయ్య ఆస్తి పాస్తుల్ని స్వాహా చెయ్యాలని పన్నాగం పన్నుతారు. ఈ పథకంలో మొదటి అంకంగా

కొరవ 11 పేజీలో

## సినిమా

9 పేజీ కొరవ

చింది. నా మోకాలి కింది భాగంలో కట్టు కట్టాను. కుంటు కుంటూ స్వయంగా డ్యూటీ ఆఫీసర్ దగ్గరకి వెళ్లాను "కాలుకు బలమైన దెబ్బ తగిలింది. మద్రాసులో రేపే ఆపరేషన్ చేయించుకోవాలి" అన్నాను ఏడ్పు ముఖం పెట్టి; పాపం, ఆయన హృదయం ద్రవించినట్లుంది. వెంటనే బయలు దేరే విమానంలో నాకు సీట్ ఎల్లాట్ చేయడమే కాక విమానం వరకూ నేను చక్రాల కుర్చీలో వెళ్లే ఏర్పాటు చేశాడు. ఆ మహానుభావుడికి నా థ్యాంక్స్" అన్నారు రఘువరన్.

### శంకర్ దర్శకత్వంలో ఎ.ఎం. రత్నం చిత్రం

తాను తమిళంలో దర్శకత్వం వహించిన "జెంటిల్‌మేన్" "ప్రేమికుడు" చిత్రాలను తెలుగులో బ్రహ్మాండమైన పబ్లిసిటీతో విడుదల చేసి, సంచలనం సృష్టించిన ఎ.ఎం. రత్నంకు తానొక చిత్రం చేసి పెడ్తానని శంకర్ చెప్పడంతో -రత్నం ఉక్కిరి బిక్కిరి అయిపోయాడట.

"ఆ సినిమాను ముందు తమిళంలో తీసి ఆ తర్వాత తెలుగులో డబ్ చేస్తాను" అన్నారు రత్నం. ఈయన స్వయంగా ఒక తమిళ చిత్రానికి దర్శకత్వం వహించ నున్నారు. అందుకు స్క్రిప్ట్ వర్క్ జరుగుతోంది.

### డిస్కోశాంతి ముందు జాగ్రత్త

మద్రాసు త్యాగరాయ నగర్‌లో తిరుపతి వెంకటేశ్వర స్వామి దేవస్థానం దగ్గర ఒక భవనం ముందు ముస్లిం వనితలా తల మీద ముసుగు వేసుకున్న ఒకామె పలకరించే సరికి ముందు ఆమెవరో అర్థం కాలేదు. నా అయోమయం చూసి, నవ్వి ఆమె ముసుగు తొలగించి "నేను డిస్కోశాంతిని. జనం నన్ను గుర్తు పట్టి గొడవ చేస్తారేమోనని ఇలా వేషం మార్చుకున్నాను" అంది నవ్వుతూ. "ఈ భవనం కొన్నారేవిటి? అని అడిగాను; ఈ భవనాన్ని హోటల్‌గా మార్చబోతున్నాను. ఇప్పటి హీరోయిన్‌లు సెక్సీ డాన్స్ చేయడంలో మాతో పోటీ పడుతున్నందున రేపు మా మార్కెట్ ఏమవుతుందో నన్న భయంతో ముందు జాగ్రత్త కోసం హోటల్ బిజినెస్ పెట్ట బోతున్నాను" అంది.

### "ఎర్రచీమలు"

ఇటీవల సంచలనాత్మకమైన విజయం సాధించిన చిత్రాలలో ఆర్. నారాయణమూర్తి రూపొందించిన "ఎర్రసైన్యం" ఒకటి. అతనిది కాలర్ ఎత్తుకు తిరిగే స్వభావం కాదు. కారు కొనలేదు. భుజానికి ఒక సంచి తగిలించుకొని రోడ్ మీద సాదాగా నడుస్తూ కనిపిస్తారు "మనం ఎక్కడ్నుంచి వచ్చామో మరవ కూడదు కదండీ?" అంటారు నవ్వుతూ.

### విజయ కంబైన్స్ కొత్త చిత్రం

"రాజేంద్ర ప్రసాద్ తండ్రిగా, కొడుకుగా, సినిమా యాక్టర్‌గా మూడు పాత్రలు ధరిస్తారు. కొడుకు పాత్ర సరసన సురభి, సినీ యాక్టర్ పాత్ర సరసన రంభ నాయికలు" అన్నారు జంధ్యాల. ఈయన రచన, దర్శకత్వం నెరపే చిత్రం షూటింగ్ డిసెంబర్ 8న ప్రారంభ మవుతుందని నిర్మాత బి. వెంకట్రామ రెడ్డి తెలిపారు.

### సింగీతం శ్రీనివాసరావుకు ప్రతిష్టాత్మకమైన అవార్డు

విశ్వ విఖ్యాత దర్శకుడు వి. శాంతారాం స్మృత్యర్థం ఆయన తనయుడు కిరణ్ శాంతారాం ఏటా మూడు చిత్రాలకు ఇచ్చే అవార్డులలో ఈమారు ద్వితీయ ఉత్తమ చిత్రంగా సింగీతం శ్రీనివాసరావు దర్శకత్వంలో కమలహాసన్ నిర్మించిన "మగళిర్ మట్టుం" (ఆడవాళ్లకు మాత్రమే) ఎన్నికైంది. శ్రీనివాస రావుకు అవార్డు తోపాటు 40 వేల రూపాయల నగదు బహుమతి కూడా ఇవ్వబడింది.

### దర్శకుడైన రాజేంద్ర ప్రసాద్

"నేటి బాలురే రేపటి పౌరులు. వారికి మనో వికాసం కలిగించే రీతిలో ఒక సినిమా స్క్రిప్టును సగం పైగా పూర్తి చేశాం. చక్కని వినోదాత్మక మైన ఈ చిత్రం నా దర్శకత్వం లోనే త్వరలో తయారవుతుంది," అన్నారు హీరో రాజేంద్ర ప్రసాద్.

### "కొండపల్లి..." టైటిల్స్

దాసరి నారాయణరావు దర్శకత్వంలో సురేష్ ప్రొడక్షన్స్ డి.రామానాయుడు "కొండపల్లి రత్తయ్య" చిత్రం నిర్మిస్తూంటే, కె.బి. ప్రకాశరావు దర్శకత్వంలో సుమన్ హీరోగా "కొండపల్లి సింహం" చిత్రం షూటింగ్ ప్రారంభం కానుంది.

### డి.వి. శేషయ్య

4 పేజీ కొరవ

అయితే ఆధునిక పరికరాలతో జిమ్ నెలకొల్పడమంటే లక్షలతో కూడిన పని; అంతటి ఆర్థిక స్థోమత ఆయనకు లేదు. అరుదైన ఈ కళ పట్ల ఆసక్తి కల్గిన వారెవరైనా శేషయ్యకు సహకరిస్తే, నెల్లూరులో ఒక మంచి వ్యాయామ శాల నెలకొంటుంది; అరుదైన నైపుణ్యం కల్గిన ఒక క్రీడాకారుడికి గుర్తింపు లభిస్తుంది.

### చిత్రసమీక్ష

9 పేజీ కొరవ

ఆసుపత్రిలో నర్సును లోబరచు కొని సంగీతకు పుట్టే బిడ్డను చంపెయ్యమని గిరి, కవితకు పుట్టే బిడ్డ ఊపిరి తీసెయ్యమని యాదగిరి నర్సుతో చెప్తారు. ఈ పథకాన్ని పసిగట్టిన గోపాల కృష్ణయ్య తానూ ఒక పథకం పన్నుతాడు. తన ఇద్దరు భార్యలకు పుట్టబోయే బిడ్డల్లో ఒక బిడ్డను రహస్యంగా తీసుక పోయి దాచమని గోపాల కృష్ణయ్య ఆ నర్సును కోరుతాడు. నర్సు ఒక బిడ్డను తీసుకు పోతుంది. ఇక మిగిలి వున్నబిడ్డ ఏ భార్యకు పుట్టిన బిడ్డో తెలుసు కోలేని పరిస్థితి ఏర్పడుతుంది. తనకు బిడ్డలు లేక పోవటంతో నర్సు తాను తీసుకు పోయిన బిడ్డ మీద మోజు పెంచుకొని ఆ బిడ్డతో పరదేశం వెళ్లిపోతుంది. మిగిలి వున్న ఒక్క బిడ్డను ఇద్దరు భార్యలూ కలిసి పెంచుతారు. ఒక భార్య ఆ బిడ్డకు సత్య అని పేరు పెడ్తుంది. రెండో భార్య భామ అనే పేరు పెట్టుంది. పెద్దయిన తర్వాత అమ్మాయి సత్యభామగా (రంభ) చెలామణి అవుతుంది.

సత్య భామకు ఊహ తెలియని వయసు లోనే ఆమె బావ రాజాతో (సురేష్) పెళ్లవుతుంది. రాజా ఎక్కడుండేది సత్యభామకు తెలియదు. అలాగే తన తల్లి ఎవరైందీ తెలియని గందర గోళం. గోలి (ఆలి) అనే యువకుణ్ణి తీసుకొచ్చి అతనే సత్యభామ బావ రాజా అని గిరి నాటకం ఆడుతాడు. రాజాను కిరాయి గూండాగా భావించి యాదగిరి, రాజాచేత గోపాల కృష్ణయ్యను ఎత్తెయ్యాలని చూస్తాడు. అన్ని విషయాలు తన తల్లి (అన్నపూర్ణ) ద్వారా తెలుసుకున్న రాజా రంగ ప్రవేశం చేసి దుష్ట సంహారం జరుపుతాడు. సత్య భామను భార్యగా స్వీకరిస్తాడు. జనార్దన మహర్షి వ్రాసిన కథ ఇది.

గోపాల కృష్ణయ్య పాత్ర చాలా ముఖ్యమైన పాత్ర. మిగతా పాత్రలన్నీ ఈ పాత్ర చుట్టూ తిరుగుతాయి. నటీ నటులంతా చక్కగా నటించారు. హాస్యం పండించారు. రంభ రుచికరమైన శృంగారం అందించింది.

వినోద ప్రధానంగా చూడ ముచ్చట కొలిపే చిత్రం రూపొందించి నందుకు నీకు "నమస్తే రంగారావు అన్న !".

### 50 ఏళ్ల క్రితం

3 పేజీ కొరవ

జాతీయ బహుజన పూజితా మహాత్మాగాంధి
తల్లివి తండ్రివి నీవేను గాంధి
చూపించి చేయించు మా గాంధి
తల్లివి తండ్రివి నీవేను గాంధి

### "కాళిదాస నవంకవయః, సశర్కరం పయః".

7 తేది రాత్రి కాళిదాసు: సాంబమూర్తి అయ్యంగార్లు పరవాలేదు. సూరిబాబు పాటేగాని ముఖంలో చచ్చినా భావ ప్రకటన కనిపించదు. బుర్రముక్కు రాజేశ్వరి ప్రతిభ మీకు పరిచితమే గదా.

కడప కమాల్ యీ దినం మాత్రం నాకు నచ్చింది. పలుచటి సంగీతం, చక్కని నటన, ప్రత్యేక రుచిని కల్పించినవి. ఎంత పెద్ద వారైనా తలా ఒక దిక్కు నుండి వచ్చి అప్పటి కప్పుడు రంగు బూసుకున్నందున కలియక రుచి, తక్కువగా వుండక తప్పదు. జాలరి! నీవూ బాగానే వున్నావు లేవయ్యా.

కాళిదాసు టిక్కెట్లు పల్లెల్లో గూడా అధికార ప్రాబల్యంతో అమ్మినారా?

### నెల్లూరు బజారు ధరలు

| | | |
|---|---|---|
| మెటగొలుకులు | పు.1-కి | 155-0-0 |
| రాగులు | | 185-0-0 |
| జొన్నలు | | 208-0-0 |
| సజ్జలు | | 215-0-0 |
| బంగారం (మద్రాస్)సవర1-కి | | 45-8-0 |
| వెండి | తు1-కి | 1-4-0 |

### స్త్రీల సభ

13-12-44 తేది బుధవారం సా.5.45గం.కు వి.ఆర్. కాలేజి యందు స్త్రీలసభ జరుగును. స్త్రీ హక్కులను గూర్చి, రావు కమిటీ బిల్లు విషయమై ఎ.సి. సుబ్బారెడ్డి, ఎల్లకూరు చంద్రశేఖర రెడ్డి, పొణకా కనకమ్మ, ఆమంచర్ల గంగాధర రావు గార్లుపన్యసింతురు. అల్లాడి అన్నపుర్ణమ్మ గారధ్యక్షత వహింతురు. స్త్రీలు మాత్రము విచ్చేయ ప్రార్థన.

తిక్కవరపు శకుంతల.

# మెజారిటీలు అందర్నీ ఆశ్చర్య పరుస్తున్నాయి

(నెల్లూరు జిల్లాలోని 11 నియోజక వర్గాలలో పోలింగ్ వివరాలు దిగువ ఇస్తున్నాము)

## నెల్లూరు

మొత్తం ఓట్లు : 2,03,645
పోలైన ఓట్లు: 1,25,927
చెల్లనివి : 1,773
పి.వి. ప్రసన్నకుమార్ రెడ్డి (కాం) 53,824
**టి. రమేష్‌రెడ్డి (తె.దే.) 63,806**
ఎ. శంకర నారాయణ (బిజెపి) 5,398
యు. బ్రహ్మయ్య (బిఎస్‌పి) 411
ఎస్.డి. అతావుల్లా (స్వ) 54
దగ్గుపాటి శ్రీధర్ (స్వ) 74
ఎన్. వెంకయ్య (స్వ) 260
వి. చంద్రశేఖర్ (స్వ) 79
ఎన్. శివశంకర్ రావు (స్వ) 200
ఎస్.కె. మహమ్మద్ హనీఫ్ (స్వ) 48
సయ్యద్ అహ్మదుల్లా హుసేన్ (స్వ) 118
**మెజారిటీ : 9,982**

## ఉదయగిరి

మొత్తం ఓట్లు : 1,23,883
పోలైన ఓట్లు : 84,788
చెల్లనివి : 1334
మాదాల జానకిరాం (కాం)26,793
**కంభం విజయ రామిరెడ్డి, (తె.దే.) 51,712**
గంగినేని రమణయ్య నాయుడు (బిజెపి) 1,165
ఆర్. సంజీవయ్య యాదవ్ (బిఎస్‌పి) 1,235
కొండపల్లి గురవయ్య(స్వ) 195
గద్దం పెంచలయ్య (స్వ) 158
ఎస్. తిరుపాలు (స్వ) 104
పి. మల్లిఖార్జున (స్వ) 186
ఎస్.ఎం. బాషా (స్వ) 1,309
కె. రత్నం (స్వ) 365
ఎస్.కె. ఇక్బాల్ (స్వ) 307
**మెజారిటీ : 24,919**

## కావలి

మొత్తం ఓట్లు : 1,52,225
పోలైన ఓట్లు : 1,06,799
చెల్లనివి : 1,954
**కలికి యానాదిరెడ్డి (కాం) 42,968**
వంటేరు వేణుగోపాలరెడ్డి (తె.దే.) 35,528
కె.వి. సత్యనారాయణ(బిజెపి)3,067
జమ్ము కొండయ్య (బిఎస్‌పి)1,005
గొట్టిపాటి కొండప నాయుడు (స్వ) 19,715
అన్నం మాలకొండయ్య (స్వ) 233
ఎం. వెంకయ్య (స్వ) 203
ఎం. నరసింహం (స్వ) 1,979
ఎస్‌డి పాలీ హుసేన్ (స్వ) 2,234
ఎ. పరంజ్యోతి (స్వ) 165
**మెజారిటీ : 7,440**

## అల్లూరు

మొత్తం ఓట్లు: 1,31,553
పోలైన ఓట్లు: 90,775
చెల్లనివి : 1,345
కాటంరెడ్డి విష్ణువర్ధన్ రెడ్డి (కాం) 40,906
జక్కా వెంకయ్య (సిపిఎం) 42,806
అల్లంపాటి సీతారామిరెడ్డి (బిజెపి) 4,877
డి. సుధాకర్‌రావు (స్వ) 1,332
దుగ్గిరాల రామయ్య (స్వ) 659
నలగట్ల రామకృష్ణారెడ్డి (స్వ) 150
**మెజారిటీ : 1,900**

## కోవూరు

మొత్తం ఓట్లు : 1,35,118

కొరవ 6 పేజీలో



### హంతకులు వీరే

మొదటి పేజీ కొరవ

పోరలు క్రమ్మిన ఆ నాయకులిద్దరూ ఎన్నికలలోనూ పబ్లిక్‌గా కాంగ్రెస్ పార్టీకి ద్రోహం చేసి, వెన్నుపోట్లు పొడిచి, తెలుగు దేశం గెలుపుకు తమ వంతు సాయంచేశారు.

రాజశేఖరరెడ్డి, మర్రిచెన్నారెడ్డి, జలగం వెంగళరావు, నేదురుమల్లి జనార్ధనరెడ్డి, ద్రోణంరాజు సత్యనారాయణ వంటి నాయకులను వారి అనుచరులను ఓడించాలనే పంతంతో, ముఖ్యమంత్రి స్థాయిలో విజయభాస్కరరెడ్డి గారు నిర్వహించిన విద్రోహ కాండ అత్యంత హేయమైనది. కడప, కర్నూలు, నెల్లూరు ఖమ్మం, విశాఖపట్టణం వంటి జిల్లాలు, హైదరాబాదు సిటీ నియోజక వర్గాలలో కాంగ్రెస్ అభ్యర్థుల ఓటమికి కాంగ్రెస్ వాదులను రెచ్చగొట్టారు. లక్షలకు లక్షలు డబ్బు సంచులు అందజేశారు. అధికారంలో వున్న రెండేళ్లలో జిల్లాలలో ముఠాలను ఏర్పరచి ప్రోత్సహించడం వల్ల ప్రతి నియోజక వర్గంలో కాంగ్రెస్ అభ్యర్థులు ఏదో ఒక రూపంలో వెన్నుపోట్ల బెడద ఎదుర్కోక తప్పలేదు.

1983లో ఒకసారి, ఇప్పుడు రెండవ సారి తన చేతుల మీదుగా కాంగ్రెస్ పార్టీకి సమాధి కట్టిన కాటికాపరిగా విజయ భాస్కరరెడ్డి చరిత్రలో ఎప్పుడూ నిందలకు గురౌతూనే వుంటారు. ఆ వాస్తవం ముందుగానే గ్రహించి కూడా ఆయన అందర్నీ కలుపుకు పోయి పార్టీ గెలుపుకు శ్రమించకుండా, ముఠా నాయకుడి వలె శత్రుత్వాలు పెంచుకొని పార్టీని పతనం చేయడం దురదృష్టకరం.

ఈ నాట్యా నేరంలో కోట్లతో సమానమైన పాపం పంచుకొన్న రెండవ ముద్దాయి - డాక్టర్ వై.ఎస్. రాజశేఖర రెడ్డి ముఖ్యమంత్రి కావాలనే ఏకైక లక్ష్యంతో అధికారంలోకి వచ్చిన ప్రతి ముఖ్యమంత్రినీ కాళ్లు పట్టి క్రిందకు లాగడానికి తన యావత్ శక్తినీ వెచ్చించి, చీటికి మాటికి పత్రికల కెక్కి పార్టీ పరువును గంగపాలు చేసిన వాడాయన. ఇంకొక ప్రక్క ఈ పోరాటంలో ఎప్పటి కప్పుడు శత్రువుల సంఖ్య పెంచుకొంటూ పోయి, పలు జిల్లాలలో, ముఖ్యంగా రాయలసీమలో కాంగ్రెస్‌ను భూ స్థాపితం చేశారు రాజశేఖర రెడ్డి. కడప, కర్నూలు, అనంతపురం, నెల్లూరు జిల్లాలలో తెలుగుదేశం అభ్యర్థులకు పబ్లిక్‌గా ప్రచారం నిర్వహించారు. సవాల్ విసిరి మరీ కాంగ్రెస్ అభ్యర్థులను ఓడించారు. చివరకు ఎన్‌టి రామారావు కూడా "రాజశేఖర రెడ్డి సిగ్గు లేకుండా మా పార్టీకి సహాయం చేస్తుంటే మేమెందుకు కాదనాలి" అని ప్రకటించాడంటే, ఆయన కాంగ్రెస్ విద్రోహం ఏ స్థాయిలో వుండింది అర్థం చేసుకోవచ్చు.

చిల్లర మల్లర నాయకులు ఎంతోమంది తమ తమ స్థాయిలో కాంగ్రెస్‌ను గుంటలో పెట్టి, తలా పిడికెడు మట్టి వేసి పూడ్చి పెట్టినప్పటికీ, వారందరికీ నేతలు వీరిద్దరే! కాంగ్రెస్ పార్టీని ఇంత హేయంగా, పాశవికంగా హతం చేసిన వీరికి ఏ శిక్ష విధించాలి? ఏ శిక్ష అందుకు తగునైనది? పార్టీ అధిష్టాన వర్గం వారిని క్షమించినా, చరిత్ర మాత్రం వారిని ఎప్పటికీ క్షమించదు.


**జిల్లావార్తలు**

5 పేజీ కొరవ


రిటర్నింగ్ అధికారి వీరబ్రహ్మయ్య చెప్పారు.

# కళ్ళుబైర్లు క్రమ్మేటట్లు

చావుదెబ్బ కొట్టారు తెలుగు ఓటరు. జన్మలో మళ్ళీ కోలుకోలేని రీతిలో అణగ కొట్టారు ప్రజలు. ఒక్కొక్క నియోజక వర్గంలో తెలుగుదేశం అభ్యర్థులు సాధిస్తున్న మెజారిటీలు చూస్తే, ఓటరు కాంగ్రెస్ పట్ల ఎంతటి ద్వేష పూరితంగా ప్రవర్తించారా, ఈసడించుకొని విసిరి పారేశారా అనిపిస్తుంది. ఐదారు నియోజక వర్గాలలో తెలుగుదేశం అభ్యర్థులు

## పసుపుచీకటి
(మొదటిపేజీ కొరవ)

50వేలకు పైబడిన మెజారిటీలతో గెలుపొందుతున్నారు. ఒక నియోజక వర్గంలో తెలుగుదేశం 62 వేల మెజారిటీ సాధించింది. రాష్ట్ర చరిత్రలోనే అపూర్వమైన విషయమిది.

ఓటర్లందరూ ఒకరికొకరు మాట్లాడుకొని, చర్చించుకొని, ఏకాభిప్రాయానికి వచ్చి, తీర్పు ప్రకటించినట్లుగా వున్న ఈ ఓటింగ్ సరళికి కారణమేమిటి?

రెండు రూపాయల బియ్యమే ఇందుకు ఒక ప్రధాన హేతువన్నది నిజం. సగటు పౌరుడి దృష్టిలో సబ్సిడీ బియ్యం, తనకు ప్రభుత్వం నుంచి అందే ఏకైక ఉపకారంగా కన్పించిందన్నది వాస్తవం. ఏడేళ్లపాటు మూర్ఖంగా ఆ పథకాన్ని అమలు చేసిన ఎన్టీఆర్ ఇప్పుడూ అదే మొండి పట్టుతో తమకు అందివ్వగలడని ఓటరు విశ్వసించాడు. ఎన్టీఆర్ చేసిన వాగ్దానం మీద వారికి నమ్మకం కుదిరింది. సబ్సిడీ బియ్యం వల్ల నిధులు హరించుకు పోయి, అభివృద్ధి కుంటుపడుతుందన్న కాంగ్రెస్ వాదుల ప్రచారం వారికి నచ్చలేదు. అభివృద్ధి అనేమాటకు సక్రమమైన నిర్వచనమేమిటో ఓటరు తనకు తాను చెప్పుకోలేక పోయాడు. రోడ్లు, కరెంట్ వంటి సౌకర్యాలు తమ నిత్య జీవితాన్ని ప్రత్యక్షంగా ప్రభావితం చేయలేవనే భావం పేద వర్గాలలో స్పష్టంగా కన్పడింది. కాంగ్రెస్ ప్రతిపాదించిన పదికిలోల ఉచిత బియ్యం పథకం ఓటరును ఆకర్షించలేదు. పైపెచ్చు, కాంగ్రెస్ హామీలను ఓటర్లు విశ్వసించలేకపోయారు; సీరియస్‌గా తీసుకోలేక పోయారు. పెరిగిన ఎరువుల ధరలు, తగ్గిన ధాన్యం ధరలు, కరెంట్ ఛార్జీల పెంపు రైతాంగంలో కాంగ్రెస్ పట్ల నిరసన భావాలు ప్రేరేపించాయి. మధ్యతరగతి రైతు మరీ ముఖ్యంగా కాంగ్రెస్‌ను ఈసడించుకున్నాడు. వ్యవసాయ పరంగా కాంగ్రెస్ పార్టీ ప్రభుత్వాలు రైతుకు ఏ రూపంలోనూ ఉపకారం చేయలేక పోయాయి.

ప్రభుత్వంలో, నాయకులలో పెరిగిపోయిన అవినీతి నిత్య పదవి కలహాలు మధ్య తరగతి ప్రజానీకంలో కాంగ్రెస్ పట్ల ఏహ్యాభావం పెంచాయి. ప్రతిరోజూ పత్రికలలో ఆ వార్తలు చదివి, చదివి వారు కాంగ్రెస్‌ను అసహ్యించుకున్నారు.

బాబ్రీ మసీదు విధ్వంసం ముస్లింల మనసులలో చేసిన గాయం ఇప్పటికీ మానలేదు. పచ్చి పుండు వలె అది వారిని బాధిస్తూనే వుంది. ఎంత నచ్చ చెప్పినా ముస్లింలు ఈ విషయంలో కాంగ్రెస్‌ను నేరస్తురాలిగానే పరిగణిస్తున్నారు.

1989 నాటి వలె అప్పుడు ఉద్యోగ వర్గాలు, కాపు కులస్తులు వంటి వారిలో తెలుగుదేశం పట్ల

# చావుదెబ్బతీశాడు ఓటరు!

ద్వేషభావం లేదు. అప్పటి కోపతాపాలు ఎప్పుడో చల్లారిపోయాయి. తెలుగుదేశం పార్టీని ఒక కుల పరంగా ద్వేషించే పరిస్థితులు లేవు. అందువల్ల ఇతర రాజకీయ పరమైన అంశాలకు ఆయా వర్గాలూ ప్రభావితమైనాయి తప్ప, ఆనాటి వలె తమ స్వంత పరిధిలో తెలుగుదేశం పార్టీని పరిగణించి, తిరస్కరించలేక పోయాయి.

ఈ కారణాలన్నీ కలసి, ఒక్కసారిగా ఉప్పెన రూపంలో కాంగ్రెస్ వ్యతిరేకత పెల్లుబికింది; ఆ పార్టీని నామరూపాలు లేకుండా తుడిచి పెట్టింది. అయితే కాంగ్రెస్ పట్లగుడ్డి ద్వేషంతో, తెలుగుదేశానికి ఓటువేశారే తప్ప, దానివల్ల తమకు ఒనగూడబోయే కష్ట నష్టాలను ఏ ఓటరూ ఆలోచించలేదనిపిస్తుంది. ప్రజా జీవితంలో కనీసపాటి సంస్కారం కూడా లేకుండా, డెబ్బయ్యేళ్ల ముదుసలి వయస్సులో లక్ష్మీపార్వతిని వెంట బెట్టుకొని ప్రణయ కలాపాలాడుతూ తిరుగుతున్న ఎన్టీ రామారావులో ఏడుకోట్ల ఆంధ్రుల్ని పరిపాలించే నాయకుడ్ని దర్శించ గల్గారంటే తెలుగు ఓటరు ఆలోచనా తీరు ఎటువంటిదో అర్థం చేసుకోవడం అసాధ్య మన్పిస్తున్నది. సబ్సిడీ బియ్యం వంటి పథకాల ద్వారా ఖజానాను దివాలా తీయిస్తే, రాష్ట్రంలో అభివృద్ధి కుంటుపడి, వెనుకబాటుతనమనే చీకటి అలుము కుంటుందన్న వాస్తవాన్ని ఓటర్లందరూ విస్మరించారు. రానున్న ఐదేళ్ల కాలంలో రాష్ట్రం నిజంగానే పసుపు చీకటిలో తారాడక తప్పదు.

తదనంతర పరిణామాలెట్లా వున్నా, ఓటర్ల తీర్పు తిరుగులేనిది. అందులోనూ అస్పష్టత, అయోమయం లేకుండా తిరుగులేని ఆధిపత్యంతో అధికారాన్ని ఎన్టీ రామారావుగారికి అప్పగించారు. రెండు వందల పైచిలుకు శాసన సభ్యులు కల్గిన ఆయనకు, ఆయన పార్టీకి ఎవరినుంచీ ఎటువంటి ప్రమాదం తలెత్తే ప్రమాద సూచనలే లేవు. ఐదేళ్లపాటు నింపాదిగా, నిలకడగా రాజ్యం చేయవచ్చు ఆయన.

అయితే పగటి వేషాలకు, వెకిలి చేష్టలకు దూరంగా వుండి, బాధ్యత కల్గిన ప్రజా నాయకుడుగా పరిపాలన చేసే పరిణతి ఎన్టీ రామారావుగారిలో వచ్చిందా అన్నదే సందేహం. ఎప్పటికప్పుడు ఏదో ఒక జిమ్మిక్కులతో, డైలాగులతో, ప్రలోభపెట్టే పథకాలతో ప్రజలను మభ్య పెట్టడానికి అలవాటు పడిన ఆయన ఇప్పుడైనా ఆ పోకడలు మాని, ప్రజా సంక్షేమం దృష్టిలో పెట్టుకొని ప్రభుత్వాన్ని నడిపిస్తే, ప్రజల తీర్పుకు సార్థకత లభిస్తుంది; ప్రయోజనం చేకూరుతుంది.

ఇది వరకు ఎన్టీఆర్ ఒక్కరే తెలుగుదేశంలో సర్వాధికారం కల్గిన నాయకులు; ఇప్పుడు అందులో సగభాగం శ్రీమతి లక్ష్మీపార్వతి తన హస్తగతం చేసుకున్నారు. కలిసి ప్రచారానికి వచ్చిన ఆ జంటను ప్రజలు సమదృష్టితో చూశారుకాబట్టి, ప్రభుత్వ నిర్వహణలో ఆమె జోక్యాన్ని కూడా సహించి తీరాలి. ఈ పరిణామం రాష్ట్రంపైన, రాష్ట్ర పరిపాలనపైన ఎట్లా వుంటుందో ఇప్పుడిప్పుడే వూహించలేము.



Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press, OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd.,